# పీఠిక

ఆంధ్రదేశమున మహాశయు లనేకులు జనించి తమ కీర్తిచంద్రికలచే భారతభూమిని బరిమళింపఁజేసిరనుట యతిశయోక్తి కాదు. అట్టిమహాపురుషులలో శ్రీ రాయబహాదూరు కందుకూరి వీరేశలింగము పంతులుగా రొకరు. వీరి చరిత్రమున నిత్యము మననము చేయవలసిన యంశము లనేకములు గలవు. కార్యదీక్ష, ధైర్యసాహసములు నాంధ్రవిద్యార్థుల మనములందుఁ బెంపొందింపవలయునన్న వారిట్టి మహనీయజీవితములఁ దఱచు చదువుట కవకాశమును బాఠశాలాధికారులు కల్పించుచుండవలయును.

పంతులుగారిచరిత్రము విదివఱ కెందఱో వ్రాసియున్నారు. పంతులుగారే స్వీయచరిత్రమును బ్రకటించియున్నారు. విద్యార్థులకు నచ్చుఁబాటులో నుండవలయు ననుతలంపుతో నీగ్రంథము నాచే సులభశైలిని వ్రాయఁబడినది. ఇందుఁ బంతులుగారి సుగుణరత్నములు గొన్ని నాతి విపులముగఁ దెలుపఁబడినవి. మహాసముద్రమువలె వారి చరిత్ర మగాధము నపారమునై యొప్పుచుండును. బాలురు పఠనమననములచే దీని నాదరించి తమజీవితమును నాపరిశ్రమను సార్థకపఱతురుగాక!

ఇట్లు గ్రంథకర్త.

# విషయసూచిక



విషయము ... పుట.

శ్రీ

# వీరేశలింగము పంతులుగారి జీవితచరిత్ర

## 1. ఉపోద్ఘాతము

ఆంధ్రదేశపుచరిత్రలో నూతనయుగమును స్థాపించిన వ్యక్తి శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులుగారు. ఏదేశము యొక్క చరిత్రయైన నచటనివసించిన మహాపురుషుల జీవిత చరిత్రలయొక్క సారమేయని విజ్ఞులందురు. ఈదృష్టితో జూచి నచో ప్రస్తుతకాలమునఁ దెలుఁగుదేశమున విజృంభించుచున్న వివిధోద్యమములకును బునాదివేసినమహాపురుషుఁడు శ్రీవీరేశలింగముపంతులుగారనుట నిర్వివాదాంశము. కనుక తెలుఁగుతల్లి సుపుత్రులలో పంతులుగారగ్రగణ్యులని చెప్పవలసియున్నది. ఆంధ్రదేశముయొక్క చరిత్ర తెలిసికొనఁగోరు వారెల్లరును పంతులుగారి జీవితచరిత్ర సమగ్రముగాఁ జదువుట యావశ్యకము. ఒకవ్యక్తి తన జీవితకాలములో నిన్ని యుద్యమములందుఁ బాల్గొని, యిన్ని సంస్థలస్థాపించి, యింతసంఘసేవ యెట్లుచేయఁ గల్గెనాయని యాయన జీవితక్రమము దెలిసికొన్నవారి కాశ్చర్యము గలుగకమానదు.

పంతులుగారు తనజీవితమునంతను సాంఘికసేవకు ధారవోయుటచేత నాయన యెందఱో మహానుభావులతో సంబంధమేర్పఱచుకొనవలసివచ్చెను. అందుచే శ్రీవీరేశలింగముగారిచరిత్ర యాయన సమకాలీనులగు ననేకులగు పెద్దలతోడను, పిన్నలతోడను జాలరీతుల ననుబంధించియున్నది. కనుక వీరేశలింగముగారి జీవితకథను జదువునపుడు మరి యెందరిచర్యలనో కనుగొనవలసిన యావశ్యకముగల్గును. పంతులుగారు ప్రచారముచేసిన యుద్యమములన్నియుఁ బ్రజాబాహుళ్యముతో విరివిగా నన్వయించియుండుటచే నాయన కనేకులనుచరులును, ప్రబలశత్రువులునుగూడ నేర్పడిరి.

సంఘమునకు వేఱుపురుఁగులవలెనుండి సాంఘికజీవితమును గ్రుంగఁదీయుచుండిన దురాచారములను నిర్మూలించుటలోఁ బంతులుగారు కనుపఱచిన పట్టుదలసాటిలేనిది. వేశ్యాసంపర్కము, లంచగొండితనము మున్నగు సంఘదోషములను రూపుమాపుటకు వీరేశలింగముగారనేకశ్రమలఁబొందియుండిరి. సమాజమందలి లోపములను సవరించుటకు పంతులుగారికి సహజముగాఁగల హాస్యగ్రంథరచనాశక్తి యెక్కువగఁదోడ్పడెను. ప్రహసనముల ననేకములు రచించి చెడుత్రోవల సంచరించు వారిలోపములను వారికి స్పష్టపఱచి, యట్టి యపమార్గముల ననుసరించుట యవమానకరమనియు, వాని మానుట తమకును, సంఘమునకునుగూడ శ్రేయోదాయకము

లనియు, వారు గ్రహించునట్లు పంతులుగారు యుక్తియుక్తముగను, మృదువుగను, సరసముగను బోధించిరి.

భాషాసేవయందు పంతులుగారి జీవితము దానికదియే సాటి. తెలుఁగుభాషలో వారెన్నియో క్రొత్తప్రోకడలఁ జూప్పించిరి. అంతేగాక ప్రాచీనరీతులఁగూడ ననేకములగునుత్కృష్టగ్రంథముల రచించిరి. ముఖ్యముగ తెలుఁగునందు వచన రచనకుఁ బంతులుగారే మార్గదర్శకులైరి. ఆయనచే రచింపఁబడిన గ్రంథము లిన్నియని చెప్పుట కష్టము. ఆ గ్రంథములన్నియుఁ దెలుఁగువారిలో నూతనోత్తేజము గల్గించి భాషాజ్ఞానము గల్గించుటకును, నైతికాభివృద్ధి పెంపొందుటకును సహకారు లగుచున్నవి.

తనతోడివారల మేలునకై పంతులవారనేకములగు సంస్థలనేర్పఱచి యవి శాశ్వతముగ నడచుట కేర్పాట్లు గావించియున్నారు. వానిలోఁ జాలసంస్థలు నేటికిని సక్రమముగ నిర్వహింపఁబడుచు సంఘమునందలి జనుల శ్రేయస్సునకుఁ బాటుపడుచున్నవి.

ఇట్లు శ్రీవీరేశలింగముపంతులుగారి జీవితచరిత్ర వివిధశాఖలకుఁ జెందిన కార్యకలాపములతో నిండినదై భావిసంతతివారి కనేకవిధముల నాదర్శప్రాయమై యున్నది. ఇట్టి ధన్యజీవి యగు పంతులుగారి జీవితకథను దెలిసికొనుట భావిసంతతివారి కత్యంతము లాభదాయకముగ నుండును. రాఁబోవుప్రకరణములందీయు త్తమజీవితమును సమగ్రముగ నెఱుంగుదుము.

"కవివరుండు శతాధికగ్రంథకర్త
స్వార్థరహితుండు బ్రాహ్మమతావలంబి
కార్యశూరుండు సంఘసంస్కర్తదాత
కందుకూరి వీరేశలింగం బితండు."

## 2. జననము, బాల్యము, విద్యాభ్యాసము

"భరతఖండమందలి పురాతనపట్టణములలో నొక టియై, రాజరాజ నరేంద్రాది చాళుక్యచక్రవర్తులకు రాజధానియై, నన్నయభట్టాది కవిగ్రామణులకు వాసభూమియై, గోదావరీతీరమందు సర్వవిధములం బ్రసిద్ధికెక్కి యున్న రాజమహేంద్రవరమున కీలకనామసంవత్సర చైత్రశుద్ధ త్రయోదశీ భానువారమునాఁడు (అనగా క్రీస్తుశకము 1848 వ సంవత్సరము ఏప్రియల్ 16 వ తేదీని) శ్రీ వీరేశలింగంపంతులుగారు జననమొందిరి. వీరిపూర్వులు సంస్థానాధిపతులుగనుండి పెక్కు కావ్యములం గృతినొందియుండిరి. మన కథానాయకులగు వీరేశలింగంగారి పితామహులగు వీరేశలింగంపంతులుగారు సంస్థానాధిపతులవద్ద దివానుగానుండి ధర్మాత్ములై భూదానాదులంజేసి కీర్తివడసిరి. పౌత్రుని జననమునకొక యేడుముందే యీవీరేశలింగము పంతులుగారు దివంగతులైరి.

శ్రీ వీరేశలింగముగారి పూర్వులు శైవబ్రాహ్మణుల లోని యారువేల నియోగిశాఖకుఁ జెందినవారు; వీరి మొట్ట

మొదటి నివాసస్థలము నెల్లూరుమండలములోని కందుకూరు; కానిమహమ్మదీయుల కాలములో నుద్యోగధర్మమునుబట్టి యేలూరువచ్చి భూములును గృహములును సంపాదించిరి. ఆంగ్లపరిపాలన మనదేశమున నెలకొన్నపిదప ప్రభుత్వమువారు వీరేశలింగముగారి పూర్వికుల జాగీరులు వశపరచుకొని యీ వంశీయుల కుపకారవేతన మిచ్చుచుండిరి.

పిదపఁ గొంతకాలమునకు ముందుచెప్పిన వీరేశలింగము గారు (కథానాయకుని పితామహులు) స్వగ్రామము విడిచి రాజమహేంద్రవరమున రాజాశ్రయము సంపాదించి క్రమ ముగా మిగుల ప్రబలులై విశేషధనార్జనముచేసి యానగర మున గొప్పసౌధమును నిర్మించిరి. చిన్నపనినుండి క్రమాభి వృద్ధినొంది నూఱురూపాయల జీతముగల గొప్పపదవినాయన పొందఁగల్గిరి. (ఆకాలమున నూఱురూపాయ లిప్పటి రెండు వేలకు సమానము కావచ్చును.) వారు పండితుల నాదరిం చియు దానధర్మములుచేసియు విశేషధనము వ్యయముచేసిరి. ఆయన యాంధ్రభాషాభిమానముగలవారై యింటభోజనము పెట్టి జీతములిచ్చి సమర్థులయిన వారిని నిలిపి భారతభాగవత రామాయణములను, గొన్నిపురాణములను, కొన్నిప్రబంధము లను తాటాకులపై పుస్తకములుగ వ్రాయించి యుండిరి వీరేశ లింగముగారి యుచ్చస్థితిఁజూచి యసూయాపరులు కొందరు కపటోపాయముచే నాయనపై కొండెములుచెప్పి యాయనను పనినుండి తొలఁగించుట కేర్పాటుచేసిరి, అంతట వెంటనే

మఱికొన్ని కష్టములనుభవించి వీరేశలింగముగారు హఠాత్తుగ మరణించిరి.

ఆయన చనిపోవునరికి నాయనకు వేంకటరత్నముగా రను జ్యేష్ఠపుత్రుడును, సుబ్బారాయుడుగారను ద్వితీయ పుత్రులు నుండిరి. సుబ్బారాయుడుగారు పంచకావ్యములఁ జదివి, తెలుఁగునందు మంచిసాహిత్యముగలవారై యింగ్లీషు భాషయందునుకొంతజ్ఞానము సంపాదించిరి. పిదప జిల్లాకలెక్టరు కచ్చేరిలో లేఖకుఁడుగ నాయన ప్రవేశించి యుద్యోగముచే యుచు పున్నమ్మయను తను మేనత్తకుమార్తెను పరిణయ మాడిరి. ఈ దంపతులే మనకథానాయకులగు వీరేశలింగము గారికి జననీజనకులు.

పున్నమ్మగారెల్లపుడును వ్యాధిపీడితురాలై దుర్బల శరీరము గల్గియుండిరి. అటిసిస్థితిలో వీరేశలింగముగారామెకు జన్మించుటచేనాయనయు దుర్బలశరీరులుగనే యుండిరి. పురిటి దినములలోఁ బున్నమ్మగారపథ్యము చేయుటచే నామెకుమా రునకు దగ్గు పట్టుకొని జీవితాంతమువఱకును కాసవ్యాధిచే నాయనకు బాధ యేర్పడెను. ఇట్లుండగా నాలునెలల ప్రాయ మపుడు వీరేశలింగముగారికి స్ఫోటకము చాల దట్టముగా వచ్చెను. ఆశిశువుజీవితము నందలుకు నిరాశచేసికొనిరి. ఒక దినమెల్లను నిర్జీవప్రతిమవలె నాశిశువుండెను. కాని యీశ్వ రానుగ్రహముచే నాశిశువురోగము నిమ్మళించి యారోగ్య మేర్పడెను.

బాలుఁడగు వీరేశలింగమునకు నాలుగేండ్లప్పు డాయన తండ్రిగారగు సుబ్బారాయుడుగారు మరణించిరి. అంతట నా బాలుఁడు పెదతండ్రిగారగు వెంకటరత్నముగారి పోషణలోనికి వచ్చెను. కాలువలపై నుద్యోగివద్ద లేఖకుఁడుగ నుండిన వెంకటరత్నముగారివద్దకుఁ దల్లితోఁ బల్లకిలోఁ గూర్చుండి పోవుచుండఁగ నొకకాలువదాటు సమయమున నైదేండ్లప్రాయము గల వీరేశలింగముగారు ప్రమాదవశమున ప్రవాహములోఁబడి కొట్టుకొనిపోవుట తటస్థించెను. అప్పుడు పల్లకిమోయుచున్న యొక బోయివాఁడు మృత్యుముఖమునుండి యా బాలుని రక్షించి తల్లికొప్పగించెను.

అక్షరాభ్యాసమైన పిదప వీరేశలింగముగారు రాజమహేంద్రవరములోని గోపాలస్వామి యాలయమున నుండిన చదువులబడిలోఁ బ్రవేశపెట్టఁబడిరి. అక్షరములు నేర్చిన పిదప తురుమెళ్ళవారియింటిలోనుండిన 'గూనిసోమరాజుగారి' బడికి బోయి బాలరామాయణమును, అమరసిఘంటువును వీరేశలింగముగారు పఠించిరి. రుక్మిణీకల్యాణము, ఆంధ్రనామసంగ్రహామున్నగు తెలుఁగుగ్రంథములను వల్లెవేసిరి. పిదప వీరేశలింగముగారి పోషకులాయనను బడిమాన్పించి సర్కారుద్యోగమున తరిఫీదు బొందుటకై తాలూకా కచేరిలోగుమాస్తాగా నుండినవారి బంధువు లొకరివద్దకుఁ బంపుచుండిరి. ఈసమయముననే ఆయన యుదయమున రఘువంశము చదువుచు సాయంకాలమున పెదతండ్రిగారివద్ద నింగ్లీషు నేర్చుకొనుచుం

డిరి. 1860 సంవత్సరములో వీరేశలింగముగారు గవర్న మెంటు జిల్లాస్కూలులో నింగ్లీషు చదువు నేర్వసాగిరి.

బ్రాహ్మణ సాంప్రదాయానుసారముగ వీరేశలింగము గారి కేడవయేట నుపనయనము జరిగెను. అప్పటినుండి యాయన శ్రద్ధగా సంధ్యవార్చుచు నొకొక్కొకపుడు సహస్ర గాయత్రియుఁ జేయుచుండిరి. గోదావరికిఁబోయి యర్ఘ్య ప్రదానముచేసి మార్కండేయస్వామి యాలయమునకును వేణు గోపాలస్వామి యాలయమునకునుఁ బోవుచుండుట యాయ నకు దైనికకృత్యములయ్యెను.

గూని సోమరాజుగారివద్ద లభించిన యాంధ్రభాషా జ్ఞానమాధారము చేసికొని తమయింటిలోని ప్రాఁత తాటాకు పుస్తకములుతీసి భారతభాగవతములందలి యనేకఘట్టములు వీరేశలింగముగారు తరచుగఁ జదువుచుండిరి.

వీరేశలింగముగారిది మొదటనుండియు దుర్బలశరీ రము. దగ్గునకుఁదోడు పీనసరోగముకూడ నాయన నాశ్రయిం చెను. అజీర్ణిలక్షణములు నప్పుడప్పు డగుపడుచుండెను. వారి శరీరనిర్మాణమున నొక్కవిషయము గమనింపదగినది. వారికి దేహబలమెంత తక్కువయో బుద్ధిబలమంత యెక్కువగ నుండెను. చదువవలసిన పాఠము లొకటిరెండుసార్లు జదివిన నాయనకుఁ గంఠస్థములగు చుండెడివి. ఆయన గ్రహణధారణ శక్తులద్భుతముగ నుండెను.

ఈపాఠశాలలోఁ జదువుకాలమున వీరేశలింగముగారి శాయాంతరగతులందు విశేషప్రజ్ఞతోఁ గృతార్థులగుచుండుటచే నెన్నియో బహుమానములు లభించెను. అంతేగాక సద్వర్తన మున కీయఁబడు బహుమతియు నాయనకే లభించెను. పాఠశాలయందుఁ జదువుకాలముననే వీరేశలింగముగారు తనపదు నెనిమిదవయేట సర్కారుద్యోగములందుఁ బ్రవేశించుట కర్హతగల్గించు సామాన్యపరీక్షలోఁ గృతార్థులైరి. తర్వాత తమపెదతండ్రిగారి మరణమువలనను, మరికొన్ని గృహాభిద్రములవలనను నాయన విద్యాభ్యాసమునకు గొంతయాటంకము గల్గినను 1870 వ సంవత్సరములోఁ బ్రవేశపరీక్షయందు తీర్ణులైరి.

వీరేశలింగముగారి పండ్రెండవయేట అనగా 1861 వ సంవత్సరమున నాయనకుఁ గాతేరుగ్రామవాసులగు అద్దంకి పట్టాభిరామయ్యగారి కుమార్తెనిచ్చి వివాహము జరుపఁబడెను. ఆచిన్నది పల్లెటూరిలోఁ బుట్టి పెరిగినదైనను పెండ్లి నాటికే కొన్ని తెలుఁగు గ్రంథములు చదివియుండెను. వివాహసమయమున వేడుకకొఱకు వధూవరులచే రుక్మిణీకళ్యాణమునుండి పద్యములు జదివించి బంధువు లానందింపసాగిరి. పెండ్లికుమార్తె పేరు మొదట బాపమ్మయయినను వీరేశలింగముగారి తల్లి తనకోడలికి రాజ్యలక్ష్మి అను పేరు పెట్టెను.

## ౩. ఉ పా ధ్యా య త్వ ము

1871 లో రాజమహేంద్రవరమున ప్రథమశాస్త్ర పరీక్షతరగతి (యఫ్. ఏ. క్లాసు) పెట్టఁబడినందున వీరేశలింగముగారందుఁజేరిరి. కాని వెంటనే యాతరగతిని ప్రభుత్వము వారెత్తివేసిరి. అంతట వీరేశలింగముగారు రాజమహేంద్రవరమందలి దొరతనమువారి మండలపాఠశాలలో నెల కిరువది యైదురూపాయలమీఁద సహాయోపాధ్యాయులుగ నియమింపఁబడిరి. ఆయన ప్రవర్తనను బట్టి యాయనయెడల విద్యార్థులకు భయభక్తులును, సహోపాధ్యాయులకు గౌరవము నుండెను. బాలురను నీతివర్తనమునందు ప్రోత్సాహపఱచుచు, పక్షపాతము చూపక సమబుద్ధితో నాయన మెలఁగుచుండిరి. మండలపాఠశాలలో పనినిలిచిపోవుటచే వీరేశలింగముగారు 1872 వ సంవత్సరమునఁ గోరంగిగ్రామమందలి ఇంగ్లీషుపాఠశాలలో ప్రధానోపాధ్యాయులుగ ముప్పదిరూపాయలవేతనముపై నియమింపఁబడి కొంతకాలము పనిచేసిరి. 1874 వ సంవత్సరమందు కోరంగిని వదలి రాజమహేంద్రవరమునకు సమీపముననున్న ధవళేశ్వరమున ఆంగ్లోదేశభాషాపాఠశాలలో నెలకు నలుబదినాలుగు రూపాయలజీతముగల ప్రధానోపాధ్యాయపదవియందుఁ బ్రవేశించిరి. ఉపాధ్యాయులుగ నుండుచునే ఆయన 1871 లో క్రిమినలు టెస్టును, 1872 లో ట్రాన్స్లేషన్ పరీక్షయు, 1875 లో ప్రెసిస్రైటింగు (సంక్షేపలేఖ

నము) పరీక్షయుఁ బూర్తిజేసిరి. ఇట్టి యర్హతలుండుటవలనఁ గొంతప్రయత్నముచేసి యుండినచో నాయన సులభముగ డిప్యూటీకలెక్టరుగఁగాని, సబ్ జడ్జిగఁగాని నియమింపఁబడుటకు వీలుండెను. కాని స్వతంత్రజీవనమైనను చేయవలెను. లేదా పావకార్యములు కలువగా నవకాశములేని యుపాధ్యాయపదవియందైన నుండవలెనని యాయన నిశ్చయించుకొనెను. 1876 వఱకు ధవళేశ్వరమున పనిచేసి యప్పుడు స్వతంత్రుఁడుగా నుండవలెనన్న యభిలాషచేతను, పాఠశాలాకార్యనిర్వాహకులతో వైమనస్యము కల్గుటచేతనువీరేశలింగముగారు రాజమహేంద్రవరము వచ్చివేసిరి.

1876 వ సంవత్సరము నవంబరు నెలలో రాజమహేంద్రవరము గవర్నమెంటు కాలేజీలో నెల కిరువది రూపాయలవేతనముపై ద్వితీయాంధ్రోపాధ్యాయులుగ వీరేశలింగముగారి నియామకము జరిగెను. ఈపదవిని నిర్వహించుకాలమున పంతులుగారు కళాశాలలోఁ బనిచేయవలసిన కాలముపోను మిగతాకాలమును సంఘసేవకును, భాషాసేవకును వినియోగించిరి. ఈపనియందుండిన యిరువది యేండ్లలోను వీరేశలింగముగారెన్నియో క్రొత్తయుద్యమములను నడపి సంఘమునందు నూతనవికాసము కల్గించి ప్రజాసామాన్యమునం దమితమగు భావసంచలనమును, భావపరిణామమును గల్గించిరి. వివిధరంగములందాయన చూపిన కార్యశూరత్వమునుగూర్చి ముందు ప్రకరణములలో విపులముగాఁ జదువగలము.

1897 వ సంవత్సరము నాఁటికి వీరేశలింగముగారనేకములగు గ్రంథములను రచించియుండుటచే వాటిని మద్రాసులో నచ్చువేయించి సంపుటములుగాఁ బ్రకటింపవలెనని వారు నిశ్చయించుకొనిరి. అంతేగాక వారారంభించిన సంఘసంస్కరణ కార్యములు రాజధానినగరమగు చెన్నపట్టణములో వ్యాప్తిచేయుట యెక్కువ ప్రయోజనకారిగ నుండునని వారికి దోఁచెను. ఈరెండుకారణములను బురస్కరించుకొని 1897వ సంవత్సరాంతమున వీరేశలింగముగారు రెండుసంవత్సరములు జీతపునష్టము మీఁద సెలవుతీసికొని సకుటుంబముగఁ జెన్నపట్టణముచేరిరి. పంతులుగారు రాజమహేంద్రవరమువదలి వెళ్ళునపుడు పురవాసులాయనపై పద్యములువ్రాసియు, విందులు చేసియు విశేషగౌరవములొనర్చి వీడ్కోలొసంగిరి. ఆయన మిత్రులేగాక భేదాభిప్రాయములు గలవారుకూడ నాయన వీడ్కోలు సభలలోఁ బాల్గొనిరని చెప్పినచో నాయనకుఁగల ప్రజాదరము స్పష్టపడఁగలదు.

పంతులుగారు చెన్నపట్టణములోనున్న కాలమున విద్యాశాఖకు డైరెక్టరుగ నుండిన డంకనుగారు వీరేశలింగముగారి ప్రతిభావిశేషము నెఱింగియుండుటచే నాయనయందధికాదరముతోనుండిరి. ఒకసారి పంతులుగారిని డంకనుగారు కలిసికొన్నప్పుడు చెన్నపట్టణములో స్థిరముగానుండిపోవునుద్దేశమువారికి కలదని తెలిసికొని కొద్దిదినములలోనే ప్రెసిడెన్సీ కాలేజీలో నప్పుడాంధ్రపండితులుగా నుండిన కొక్కొండ వెం

కటరత్నముపంతులుగారిని రాజమహేంద్రవరము బదిలీచేసి వీరేశలింగముగారిని ప్రెసిడెన్సీకాలేజిలో నాంధ్రపండితులుగ నియమించిరి. రాజధానికళాశాలలో నాంధ్రగ్రంథములనేగాక వీరేశలింగముగారు భాషాంతరీకరణమునుగూడ బోధించుచుండిరి. అందుచే వారికి తీరిక చాలకొలఁదిగ నుండెను. అయినను సంఘసేవలో విశేషముగఁ బాల్గొని వితంతువివాహములు, స్త్రీవిద్యాభివృద్ధి, అనాథపోషణము మున్నగు నాయనకిష్టమైన యుద్యమములనుబహుశ్రద్ధతో నడపుచుండిరి.

తుదకు 1904 వ సంవత్సరమున నేఁబదియైదేండ్లు నిండుటచే నుపకారవేతనముబొంది 1905 వ సంవత్సరములో రాజమహేంద్రవరమునకు తిరిగి వచ్చివేసిరి. మద్రాసులో నాయన యుండినకాలమున ననేకగౌరవములఁ బొందుచుండిరి. అయినను స్వస్థలముపైఁగల యభిమానమును, జన్మదేశమునందున్నచో సంఘసేవకు మరికొంత యెక్కువ యవకాశము గల్గుననునాశయు పంతులవారిని రాజమహేంద్రవరము చేరుటకుఁ బురికొల్పినవి.

## 4. పత్రికారచన

1870 వ సంవత్సరమునాఁటి కనగా సర్వకళాశాలాప్రవేశపరీక్షకుఁ జదువుచున్నకాలమునందే వీరేశలింగముగారు

పత్రికలకు వ్యాసములు వ్రాయునభ్యాసముగల్గి యుండిరి. ఆరోజులలో జిల్లాపాఠశాలా ప్రధానోపాధ్యాయులుగ నుండిన బారోఅను నాయన నడపుచుండిన Godavery Edu- cationist (గోదావరి విద్యాప్రబోధిని) అను మాసపత్రిక యందు తెనుఁగుభాషలో వ్యాసములను పద్యకావ్యములను వ్రాయుచుండిరి. ఉపాధ్యాయపదవియందుఁ బ్రవేశించిన తోడనే బందరునందలి పురుషార్థప్రదాయినీ పత్రికకు గ్రంథ ములు వ్రాసి పంపుచుండిరి. ఈపద్యకావ్యములందలి గుణము లను గ్రహించి పండితులనేకులు శ్లాఘింప నారంభించిరి.

స్త్రీవిద్య మొదలగు సాంఘికవిషయములఁ గూర్చి తమకుఁగల యభిప్రాయములఁ బ్రకటించుటకు సావకాశముగ నుండునన్న యుద్దేశముతో 1874 వ సంవత్సరమున ఆశ్వ యుజమాసమందు వివేకవర్ధని అను నాలుగు పెద్దపుటలుగల మాసపత్రికను వీరేశలింగముగా రారంభించిరి. కొద్దినెలల లోనే ఈపత్రిక పదునేడుపుటలుగల దయ్యెను. ఈపత్రికా నిర్వాహణమునందు మార్గదర్శకముగ నుండుటకై పంతులు గారీ క్రిందిపద్యమును మూలసూత్రముగ గైకొనిరి.

క. ఒరులేయవి యొనరించిన
నరవర యప్రియము తనమనంబునకగుఁదా
నొరులకు నవిసేయకునికి
పరాయణము పరమధర్మపథములకెల్లన్.

వివేకవర్ధనీ చతుర్ధమాసపత్రిక కారంభమున వీరేశలిం గముగారు తమ్ముఁగూర్చియు, తమపత్రికనుగూర్చియు వ్రాసిన దానినిబట్టి కొన్ని విషయములు తెల్లమగును.

సీ. బ్రాహ్మణుండను హూణభాష నేరచియుందు
నేబ్రవేశపరీక్ష నిచ్చినాఁడ
నాంధ్రమున నొకింత యభిరుచిగలవాఁడ
దేశాభివృద్ధికై లేశమైన
బ్రాలుమాలక పాటుపడ నిచ్ఛగలవాఁడ
గవితాపటిమ కొంతగలుగువాఁడ
నోపిక సర్వజనోపయుక్తములైన
విషయమ్ములను నాతివిషయములును
సులభశైలి నందఱకును దెలియునట్లు
కఠినసంధులులోను గాఁగలవి విడచి
వ్రాయుదు నొకప్పు డన్యదేశీయములును
లోనుగాఁగల వానిని బూనికూర్తు.

పత్రికాప్రకటనమున బంతులుగారి ముఖ్యోద్దేశములు రెండు:— భాషాభివృద్ధి; దేశాభివృద్ధి; తెలుఁగుభాషలో మృదువైన సులభశైలిని సలక్షణమైన వచనరచనచేసి భాష నభివృద్ధి చేయుటకు వీరేశలింగముగారు యత్నించిరి. సంఘ మండలిజనులలోఁగల దురాచారదుర్వర్తనముల మాన్పి వారి

నధిక నీతిమంతులనుగఁజేసి దేశము నున్నతస్థితికిఁ దెచ్చుట కును బంతులుగారు సర్వథాప్రయత్నము చేయుచుండిరి. విద్యావిషయము, వ్యవహారవిషయము, కులాచారవిషయము, నీతివిషయము, మతవిషయము—ఇట్లు నానాముఖములఁగృషి చేసి దేశాభివృద్ధికిఁ దోడ్పడుట పంతులుగారి యాశయ ముగ నుండెను. సంఘమందలి దురాచారముల మాన్పయ త్నించుటలో వీరేశలింగముగారి పత్రికానిర్వహణమున కెన్నియో యాటంకము లేర్పడెను. లంచములు తీసికొనుట తప్పన్నచో రాజకీయోద్యోగులకుఁ గోపము; వేశ్యాంగనా సంగమము నీతికాదన్న శృంగారనాయకులకుఁ గోపము; పూర్వమూఢాచారముల మాన్పుకొనవలెనన్న శ్రోత్రియులకుఁ గోపము; నీతిమాలిన బాహ్యవేషములు మతవిరుద్ధములన్న నాచార్యపురుషులకుఁ గోపము. ఇట్లు పత్రికోద్దేశమును నెఱ వేర్చుటలో నిందఱకోపమునకు గుఱికావలసి వచ్చినను వీరేశ లింగముగారు నిర్భయముగా, నిస్సంకోచముగా, నిష్పక్షపాత ముగాఁ దమధర్మమును నెఱవేర్పయత్నించిరి.

వివేకవర్ధనిని నడపుటలోఁ బంతులుగారెన్నియో కష్ట ములఁ బొందవలసివచ్చెను. పత్రికనారంభించిన యాఱునెలల లోనే బొందెతో స్వర్గమునకుఁ బోయెదనని ప్రకటించినయొక యోగిని మోసమునుగూర్చి ప్రకటించినందులకై ఆయోగిని మొదలఖక్తితాత్పర్యములుగలయొకసంపన్నగృహస్థుఁడొకఁడు మానసష్టమునకై వివేకవర్ధనీ పత్రికాధిపతిపై వ్యాజ్యెము

వేయుదుమని బెదరించిరి కాని యామోసమును ఋజువు చేయుటకుఁ దగినసాక్ష్యము కలదని ధైర్యముతోఁ జెప్పుటచే వ్యవహారమునకు దిగినచో నిజము బయటపడుననుభయము జెంది ప్రతిపక్షులభియోగము తేక మానివేసిరి ఇట్లు దుష్ట వర్తనము మాన్పయత్నించుటలోఁ బంతులుగారికి విరోధు లెక్కువగుచుండిరి.

పత్రికాప్రకటనమునకును, తామురచించిన గ్రంథముల ముద్రించుటకును ముద్రాయంత్రమును స్థాపింపవలెనను నభి లాష పంతులుగారి కెక్కువగా నుండెను. కొన్ని ప్రయత్న ములు జరిగినమీఁదట పంతులుగారితో మఱియెనుగురుచేరి ఒక్కొకరు మున్నూటయేఁబది రూపాయలచొప్పున చేర్చి భాగస్వాములుగ నేర్పడి ముద్రాయంత్రము తెప్పించి రాజమ హేంద్రవరమున నెలకొల్పిరి. అంతట బంతులుగారు ధవళే శ్వరమునఁ బనిమానుకొని రాజమహేంద్రవరము వచ్చివేసిరి. 1876 జూలై నెలనుండి వివేకవర్ధని పక్షపత్రిక యగుటయే గాక 'హాస్యసంజీవని' యను మాసపత్రిక దాని కనుబంధ ముగాఁ బ్రకటింపఁబడ నారంభించెను. ఈ హాస్యసంజీవనిలో బ్రాహ్మవివాహము మొదలగు ననేకప్రహసనములు పంతులు గారు వ్రాయనారంభించిరి. ఇట్టి ప్రహసనములు వ్రాయుటకు తెలుఁగు భాషలోనిదియే ప్రారంభము. అందుచే వీనినిఁజదివి విద్యావంతు లెక్కువగ నానందింపసాగిరి.

1878 వ సంవత్సరప్రాంతమున రాజమహేంద్రవరమున వాలెన్ అను నాంగ్లేయుఁడు జిల్లాజడ్జిగానుండి న్యాయవాది పట్టాలనిచ్చుటలో నక్రమముగాఁ బ్రవర్తించి లంచములు పుచ్చుకొనుచుండిన సిరస్తాదారు మాటలువిని విద్యావిహీనులకు యోగ్యతాపత్రికల నిచ్చుచుండెను. ఈవిషయమును బంతులుగారు వివేకవర్ధనిలో ధైర్యముగాఁ బ్రకటింపఁగా హైకోర్టువారిక ది తెలిసి జిల్లాజడ్జిగారిని సంజాయిషీ అడిగిరి. జిల్లాజడ్జిగారు వీరేశలింగంపంతులుగారికి సమనుపంపి యావిషయము ప్రకటింపఁబడిన వివేకవర్ధనీ పత్రికాప్రతినిజూపి ప్రశ్నింపఁగా పంతులుగారు నిశ్చలముగా సమాధానము చెప్పిరి. ఇంతలో హైకోర్టువారు అక్రమముగా నీయఁబడిన పట్టాలను రద్దు చేసిరి.

చిన్న పెద్దయనుభేదములేక సంఘమునందుఁ గలలోపముల నెన్నిటినో సవరించుటకు వివేకవర్ధనిని బంతులుగా రుపయోగించుచుండిరి. అంతేగాక వారిచే స్థాపింపఁబడిన ప్రార్థనసమాజము; సంస్కరణసమాజము మొదలగువాని కార్యక్రమమునకును ఈపత్రిక విశేషముగఁ దోడ్పడెను. 1891 లో శ్రీ న్యాపతి సుబ్బారావుపంతులుగారారంభించినచింతామణి లోను పత్రికయొక్క ప్రకటనమందును వీరేశలింగముపంతులుగారెక్కువగఁ బాల్గొనిరి. 1897 వ సంవత్సరమునఁ బంతులుగారు రాజమహేంద్రవరము వదలి మదరాసుకుఁ బోవునపుడు వారు వివేకవర్ధనీ ముద్రాక్షరశాల నమ్మివేసిరి. తరువాత పం

తులుగారు సంఘసంస్కార కార్యములందును, విద్యాసంస్థల స్థాపించుటయందును నిమగ్నులై పత్రికా రచనను నిలుపు చేయవలసి వచ్చెను.

1905 వ సంవత్సరమున మద్రాసు ప్రెసిడెన్సీకాలేజీలో తెలుఁగు పండితపదవినుండి విరమించి రాజమహేంద్రవరము తిరిగివచ్చిన పిదప సత్యవాదిని యను పేరున నొక వారపత్రికను ఇంగ్లీషు తెలుఁగుభాషల రెండింటియందును వ్యాసములుచేర్చి ప్రకటించుచుండిరి.

## 5. సంఘసంస్కరణము

వీరేశలింగముపంతులుగారి జీవితము సంఘసంస్కరణమే పరమావధి గాఁగలదియని యాయన జీవితచరిత్ర చదివినవారు గ్రహింపవలసిన ముఖ్యవిషయము. సంఘదోషములను నిర్మూలించునుద్యమమును నడపుటకే భగవంతుఁడాయనను సృజించెనేమోయని తోఁచుచున్నది. సంస్కారవాసన యాయన చిన్నతనమునుండియు మరణించువఱకు నాయన నావేశించియుండెను. వీరేశలింగముగారు బాల్యమున సంస్కర్త. యౌవనమున సంస్కర్త, వార్ధక్యమున సంస్కర్త. దయ్యము లందు ప్రజలకుఁగల పిచ్చినమ్మకములఁ బాఱద్రోల యత్నించుట మొదలు స్త్రీపునర్వివాహోద్యమము వఱకుఁ

గల సాంఘికోద్యమములలో స్వల్పమైనది, ఘనమైనదియను భేదములేకుండ నన్నిటిలోను నాయన పాల్గొని యని నెఱవేరుటకై తన సర్వస్వమును ధారవోసెను.

వీరేశలింగముగారు రాజమహేంద్రవరమున నుపాధ్యాయులుగనుండిన కాలమున ననఁగా 1874 వ సంవత్సర ప్రాంతమున శ్రీ కొక్కొండ వెంకటరత్నముపంతులుగారును వారి పక్షమువారును కలిసి స్త్రీవిద్యను నిషేధించుచు నాంధ్రభాషా సంజీవనిలో వ్యాసములు వ్రాయదొడంగిరి. అంతట వీరేశలింగముగారు స్త్రీవిద్యను విధించుచు వారితో వాదము చేయ నారంభించిరి. పంతులుగా రాకాలమున స్త్రీవిద్యను సహేతుకముగను, యుక్తియుక్తముగను సమర్థించుచుం బద్యరూపమునంగూడం బత్రికలకు వ్రాయుచుండిరి. వారి రీతిని దెల్పుటకై యట్టి పద్యములలో నొకటి యుదాహరింపంబడు చున్నది.

ఉ. వింతగ వాదమేల యుపవేదులపోలిక? స్త్రీ విద్యసి
ద్ధాంతముచేసినారు మనతద్జ్ఞులుపూర్వులు: వేదమొక్కటే
యింతులుచూడఁగూడదనిరింతె; పురాణచయంబుస్త్రీలకై
యెంతయుఁజేయుటల్ స్మృతులునెల్లపురాణములోక్తిచెప్పవే

తమ వాదము కేవలము వాగ్రూపముసఁగాక క్రియారూపమున నిరూపించుటకై పంతులుగారు ధవళేశ్వరములో

నున్న కాలమున 1874 వ సంవత్సరమున చందాలసహాయ
మున నొకబాలికాపాఠశాలను స్థాపించిరి.

ఈకాలమునందే యనఁగాఁ బంతులుగారు ధవళేశ్వరము
వదలి రాజమహేంద్రవరము ప్రవేశించిన కాలమున (1876)
ఆపట్టణమందలి సాంఘికస్థితి చిత్రముగ నుండెను. అప్పుడు
న్యాయాధిపతులు (జడ్జీలు, మునసబులు) మొదలగు పెద్ద
యుద్యోగస్థులందఱును వేశ్యాధరపరాయణులై యుండిరి.
అధికారుల యిండ్లకు స్వకార్యార్థము పోయినపుడు వేశ్యల
నుంచుకొన్నవారి కెక్కువ గౌరవము; ఉంచుకొనివారికిఁ
దక్కువగౌరవము. న్యాయసభలలో సహితము వారకాంతా
వల్లభులైన న్యాయవాదులవాదమునం దాదరము; కేవలకుల
కాంతావల్లభులైన న్యాయవాదులవాదమునం దనాదరము.
ఆకాలమునందు రాజమహేంద్రవరమున పాఠశాలయనఁగా
వేశ్యల చదువుకూటమనియే యర్థము. వేశ్యలనృత్తగీతాదు
లకై పెట్టింపఁబడిన పాఠశాలలప్పు డాపురవరమునందెన్నియో
యుండెను. వేదపాఠశాలలకును, శాస్త్రపాఠశాలలకును చిల్లి
గవ్వ నియ్యనొల్లని శుద్ధశ్రోత్రియులుసహిత మధికారుల
మెప్పునకయి యీవేశ్యలపాఠశాలలకు నెలకయిదులు పదులు
రూపాయలు చందాలిచ్చుచుండిరి. ఎవ్వరియింటనైన శుభ
కార్యములువచ్చినఁ దమపేరున వ్యవహరింపఁబడు భోగము
మేళము పెట్టించవలసినదని ప్రముఖులగు నధికారులు సందే
శము బంపుచుండిరి. వేశ్యాప్రియులసంఖ్య మేరమీరు చుండు

టచే నాస్థితిని వివరించుచుఁ బంతులుగారు పత్రికలో నిట్లు వ్రాసిరి. 'ఈకాలములో జారిణీసంభోగమే సత్కార్యమని కొనియాడ బడుచున్నది. కట్టుకొన్నయాలిని దుఃఖపెట్టి, పరాంగనలఁ గవియువారు గర్హణీయులుగా నెన్నఁబడ కున్నారు; మరిలంజెలు లేనివారు పెద్దమనుష్యులే కారనిగణింపఁ బడుచున్నారు. మీఁదుమిక్కిలి యేకభార్యావ్రతస్థులు పురుషులే కారనియు నపుంసకులనియుఁ బరిహాసింపఁబడుచున్నారు' పైని వివరింపఁబడిన దుర్వ్యాపారము మాన్పుటకై పత్రికాముఖమునను, ఇతరవిధములను వీరేశలింగముగారు మిగులఁ గృషియొనర్చిరి. అందుచేఁ బ్రముఖులకాయనపైఁ గోపమధికముగ నుండెనుకాని దైవబలముచే వేశ్యాలోలత కొంతతగ్గఁ జొచ్చెను.

'వసూళ్ళువేయుట' అనఁగా వివాహాదిశుభకార్యములయం దాహూతులయి చూడవచ్చిన పెద్దమనుష్యులందఱును భోగముమేళమునకు రూపాయకు దక్కువగాకుండఁ గానుకలొసఁగెడి యాచార మాకాలమున సర్వసాధారణమై యుండెను. తాంబూలమునకు వచ్చిన వారిట్టి కానుక లొసఁగకుండుట యవమానకరముగ భావింపఁబడుచుండెను. బీదవారికీ విషయమునఁ జాలకష్టముగా నుండెను. అధికారులు కొందఱు నెలకొకటి రెండుపర్యాయములు తమయింటనేదో మిషపై మేళములు పెట్టించి వసూళ్ళు చేయించి యట్లువచ్చిన మొత్తములో సగము మాత్రమే వేశ్యలకిచ్చి మిగిలినది తామే గైకొనుచుండిరి.

ఈదురాచారము మాన్పుటకు పంతులుగారు సభల మూలమునను వివేకవర్ధని పత్రికాముఖమునను యత్నింపఁగా నీపద్ధతిని దొలఁగించుటకుఁ బ్రతిజ్ఞగైకొన్న సంఘమొకటి యేర్పడి దీనికి వీరేశలింగముగారు కార్యదర్శిగ నియమింపఁబడిరి. క్రమముగా బ్రజలందుఁ బ్రబోధము కలిగి వసూళ్ళు వేయు నాచారముతగ్గ నారంభించెను.

ఆదినములలో వేశ్యనుంచుకొననివాఁ డరసికుఁడనియుఁ బౌరుషహీనుఁడనియు భావింపఁబడినట్లే లంచములు పుచ్చుకొనివాఁ డప్రయోజకుఁడనియు బుద్ధిహీనుఁడనియుఁ బరిగణింపఁబడుచుండెను. లంచములు పుచ్చుకొనుట యుద్యోగధర్మమని యెల్లవారును దలఁచియుండుటచేత నిచ్చువారుగాని పుచ్చుకొనువారుగాని దానిని దప్పుగాఁదలఁపకుండిరి. రహస్యమన్నదిలేక బంటుమొదలు మంత్రివఱకు నందఱును బహిరంగముగనే యుత్కోచస్వీకరణము చేయుచుండిరి.

ఈస్థితియందు రాజమహేంద్రవరమున డిస్ట్రిక్టుమునసబుగనుండిన యొకఘనుఁడు వాది, ప్రతివాది, దరిద్రుఁడు, ధనికుఁడు ననుభేదములేక యేపక్షమువా రెక్కువ లంచమిచ్చిన నాపక్షమున దీర్పుచెప్పుచుండుటయు, కొలఁదికాలములోనే నమితముగ ధనార్జనచేయుటకై చాల వ్యాజ్యముల నొక్కసారియే విచారణచేయుటయు జరుగుచుండెను. అంతేగాక అన్నివ్యాజ్యముల గ్రంథముల నొకేసారి చదివి తీర్పువ్రాయుటకష్టమగుటచే జిల్లాకోర్టులో న్యాయవాదిగనున్న

తనబంధువగు నొకరిచే చిత్తుతీర్పుల వ్రాయించి వానినికోర్టులోఁ జదువుచుండెను. ఆయధికారియొక్క దుర్నయము నెట్లయినఁ దుదముట్టింపవలెనని నిశ్చయించుకొని మిత్రుల సహాయముతో ధర్మస్థాపనకై సాక్ష్యము నన్వేషింపసాగిరి. ఇందులకై మునసబుగారి పక్షమునఁ జిత్తుతీర్పులను వ్రాయుచున్నన్యాయవాదియింటఁ బైటఁ బారఁబోసిన చిత్తుకాగితములు వీధులు తుడుచువానికి గొంతధనమిచ్చి కొని యవియన్నియుఁ బరిశీలించి సరియగుపర్ధమిచ్చునట్లొక దానికొకటి యతికించి పూర్తి కాగితములుగ చాలనోపికపట్టి వీరేశలింగముగారు సిద్ధపఱచిరి. ఈసంగతి యా న్యాయవాదికిఁ దెలిసి తనదస్తూరితో నున్న కాగితములు కోర్టులో దాఖలైనయెడల కొంపమునుగునని గ్రహించి వీరేశలింగముగారితోఁ బనిచేయుచున్న వారినందఱి నేదోయొక విధమున లోఁబరచుకొని యాకాగితముల సంగ్రహింపఁగల్గెను. కాని బుద్ధిసూక్ష్మతగల పంతులుగా రొక కాగితము మాత్రము చాలరహస్యముగ దాఁచియుంచి సమయము వచ్చినపుడు దానిని కోర్టులో బహిరంగముచేసి తమవాదము నెగ్గించుకొనఁగల్గిరి. తుదకు మునసబుగారి చర్యలు ఋజువైనందున హైకోర్టువారు ఆయనను విచారించుట కుత్తరువు చేసిరి. తోడనే పాప మాయుద్యోగి యాత్మహత్య గావించుకొనెను.

మనదేశములో శవములను శ్మశానములకుఁ గొనిపోవుటు విధమును, శవములను ఖననముచేసెడు విధమును

నాగరికులచే గర్హింపఁబడఁ దగినవిగనున్నవని పంతులుగా రభిప్రాయపడిరి. ఎంతగౌరవముగల వారినైనను మరణింపఁగనే రెండు వెదురుబద్దలపై వేసి యందఱకును భయము గొల్పునట్లు మోసికొని పోవుటయు, మరణసమయములందు బంధువులు తోడుపడి శవములనుమోయక డబ్బిచ్చి పనికిమాలిన యపవిత్రులచే మోయించుటయు, ఖననముచేసిన శవములను నక్కలును కుక్కలును పైకీడ్చునట్లు గోతిలోఁబైపైనఁబాఁతిపెట్టి మన్నువేయుటయు దురాచారములుగఁ గన్పట్టెను. అంతట బంతులుగారు కొన్నిసభలు జరిపి మరణము తటస్థించినపుడు లౌకికులు వైదికులునను భేదములేక యెల్లవారును ప్రేతమును రుద్రభూమికిఁ గొనిపోవుటలోఁ దోడ్పడవలెనని కొందఱిచే ప్రమాణములు చేయించిరి.

మానవదేహమందలి కరచరణాది సమస్తావయవములును యథాప్రకారముగా పెరుగుటయే వృద్ధిగాని, యొక్క తలయో కాలో యత్యధికముగాఁ బెరుగుట వృద్ధికాక రోగమయినట్లే దేశవిషయములోఁగూడ జనులు నీతిమత కులాచారాదులైన సమస్తాంగములందునుసమానముగా నభ్యున్నతి చెందుటయే నిజమగునభివృద్ధియని పంతులుగారి మతము. ఎక్కడనో దూరముననున్న పరిపాలకులను వారి శాసనములను దూషించుటకంటె సమీపముననుండి రాజశాసనము నడుపువారి దోషములను వెల్లడిచేయుట యధికప్రయోజనమని యాయన నమ్మకము. దొరతనమువారికిఁ జెల్లించెడు సెల

పన్నుల మొత్తముకంటె నీరిచ్చెడు యుద్యోగుల కియ్యవలసిన లంచముల మొత్త మెక్కువైనపుడు నేలపన్ను కొంచెము తగ్గినమాత్రమున రైతుల కేమిలాభము? వ్యాజ్యెపు మొత్తముకంటె న్యాయాధిపతికి సమర్పింపవలసిన యుపాయనమే యధికమయినపుడు స్టాంపుపన్ను కొంచెము తగ్గినందువలన జనులకుఁ బ్రయోజనమేమి? చేసిన నేరమునకుఁ జెల్లింపవలసిన జుల్మానాకంటె దోషిని దండింపక విడుచుటకును, నిర్దోషిని దండించుటకును మేజస్ట్రీటు స్వీకరించెడు ముడుపెక్కువైనపుడు శిక్షాస్మృతియందలి స్వల్పమగు మార్పులవలన నెట్టి యుపయోగముండును?

ఇట్టి యాలోచనలచేఁ బంతులుగారు సంఘమందలి చిన్నదోషములను, పెద్దదోషములను సరిచేయుటకు యాపచ్ఛక్తిని వినియోగించిరి.

వివాహాది శుభకార్యములందు బంధుమిత్రాదులను భోజనములకుఁ బిలుచునపుడు యజమానుఁడు స్వయముగఁ బోయి పిలచి రావలెనను నాచారమొకటి మనలోఁ గలదు. కార్యసమయములయందు యజమానుఁడే స్వయముగాఁ బోవలెనన్న కాలహరణమగుటయేగాక నితరమగుపనులు నెఱవేర్పుట చాల కష్టముగా నుండును. యజమానుఁడు స్వయముగాఁ బిలువనిచో భోజనమునకు రామని మూర్ఖతతోఁ బూర్వాచారపరాయణులు కొందఱు మానివేయుచుందురు. యజమానుని కష్టమును కొంతవఱకుఁ దగ్గించుటకై యాహ్వాన

పత్రికల మూలమునఁ బిలచుట సులభమని బోధించి యిట్టి కార్యక్రమము నాచరణయందుంచునట్లు చేయుటకుఁ బంతులు గారు సభలు జరపిరి. చీట్లు వంచి దొరలవలె భోజనమునకుఁ బిలుచుట బ్రాహ్మణజాతి గౌరవమునకు భంగకరమని మొదట కొందఱు వాదించిరిగాని యందుల కనుకూలురు కొందఱొక సంఘముగ నేర్పడి యీనూతన పద్ధతి నవలంబించిరి. సంఘసౌకర్యమునకుఁ దోడ్పడు నిట్టి చిన్నవిషయములను సంస్కరించుటయందును, పంతులుగారు శ్రద్ధను, పట్టుదలను జూపుటకు వెనుదీయకుండిరి.

## 6. స్త్రీ పునర్వివాహోద్యమము

ఎవరైనను దాముపదేశించుదాని ననుష్ఠించి చూపుట వలనఁ బ్రయోజనముండునుగాని కేవలము శుష్కోపన్యాసముల వలనను, సభలమూలమునను విశేషములాభముండఁ బోదని పంతులుగారు మొదటనే గ్రహించిరి. కాని మొదట చిన్న చిన్న మార్పులనుజేసి క్రమముగాఁ బెద్ద సంస్కరణములను జరుపుటకుఁ బూనుకొనఁదలఁచిరి.

ఇట్లుండఁగా 1874 వ సంవత్సరములోఁ జెన్నపురిలోని ప్రముఖులు కొందఱు స్త్రీ పునర్వివాహమును బ్రోత్సాహపఱచుటకై యొకసమాజముగ నేర్పడి పనిచేయ నారంభించి

యున్నిమండలములకును బత్రికలఁబంపిరి. ఆసమయమున నే విశాఖపట్టణములోని కొందఱి ప్రార్థన ననుసరించి శ్రీ మహా మహోపాధ్యాయ పరవస్తు వెంకటరంగాచార్యులవారు పునర్వివాహసంగ్రహమను పేరుతో స్త్రీపునర్వివాహము శాస్త్రసమ్మతమని 1875 లో నొకపుస్తకము వ్రాసి ప్రకటించిరి. ఆ గ్రంథమును ఖండించుటకై శ్రీ కొక్కొండ వెంకటరత్నము పంతులుగారు మున్నగువారు ప్రయత్నించుచుండిరి. ఇంతలో బందరునఁ బ్రకటింపఁబడు పురుషార్థప్రదాయినీ పత్రికయందు వితంతూద్వాహమును సమర్థించుచు 'సౌఖ్యార్థి' యను నొకరు వ్యాసము వ్రాసిరి.

బాలవితంతువుల దౌర్భాగ్యస్థితినిమాన్పి వారికిద్వితీయ వివాహముజేసి సౌఖ్యముగల్గించుట యుత్తమకార్యమని పంతులుగా రభిలషించుచుండినను స్త్రీ పునర్వివాహములు వ్యాపించుటకుఁ దగిన కాలమప్పటి కింకను రాలేదని తలఁచి యట్టి గొప్పమార్పునకయి కృషిచేయుట కాయనకు సాహసము పుట్టలేదు.

ఇట్లు కొంతకాలము నడువగా నొకనాఁడు పంతులుగారి సహపాఠియు, మిత్రుఁడును, దేశాభిమానియునగు చల్లపల్లి బాపయ్య పంతులుగారు స్త్రీ పునర్వివాహములు చేయుటకుఁ బూనుకొనుట యవశ్యకర్తవ్యమని యత్యంతాసక్తితోఁ జెప్పిరి. మొదటఁ బంతులుగారా విషయమున నుపేక్షించిరి గాని బాపయ్య పంతులుగారి ప్రోత్సాహముచే నావిషయ

మున నొకసభ జరుపుటకు నిశ్చయించిరి. వితంతూద్వాహము వంటి మహాకార్యమును తలపెట్టుటకుఁ దగిన శక్తి తమకు లేదేమోయని మొదట వీరేశలింగముగారికి సంకోచముగ నుండెను గాని యీకార్య మీశ్వరప్రేరితమును నీశ్వరప్రీతికరమును గనుక నందుల కుద్యమించుట తమధర్మమను దృఢ విశ్వాసముతోఁ బంతులుగా రీకార్యమున కుద్యుక్తులైరి.

విధవావివాహమునుగూర్చి చర్చించుట కేర్పడిన సభ కనేకవైదికులును, లౌకికులును వచ్చి వీరేశలింగముగారివాదమును ఖండింప సిద్ధముగా నుండిరి. 1879 వ సంవత్సరము ఆగష్టు 13 వ తేదీ నాసభ జరిగెను. అప్పటికి విధవావివాహమను శబ్దమే కర్ణకఠోరముగ నుండెను. కాని వీరేశలింగముగారు యాజ్ఞవల్క్య, మను, పరాశరస్మృతుల నాధారముగఁ గొని కొన్ని యుక్తులను జేర్చి బాలవితంతువుల దురవస్థను వివరించుచు జాలిగొల్పునట్లొక యుపన్యాసము వ్రాసి సభలోఁ జదివిరి. సామాన్యజనులకు గొంత మనస్సు కరిగించునదిగ నుండినను బండితులకుమాత్ర మాయుపన్యాస మాగ్రహము గల్గించెను. అందుచే వారు పరుషవాక్కులతో సమాధానములిచ్చి ఖండనోపన్యాసములను మఱునాటి సభలోఁ జదివెదమని చెప్పి వెడలిపోయిరి. పిదప రాజమహేంద్రవరమున గొప్ప సంచలనము బయలుదేఱె నెచట జూచినను వితంతూద్వాహమునుగూర్చి చర్చలు జరుగఁ దొడఁగెను. వీరేశలింగముగారి మిత్రులుగూడ నాయనను నిరుత్సాహ పఱుపసాగిరి. కాని

బొపయ్యగారొక్కరుమాత్రము సహాయము చేయుచుండిరి. పండితుల నెవరినైనను శాస్త్రగ్రంథము లెరుపీయవలసిన దని పంతులుగారడుగగా వారు తిరస్కరించుచు వచ్చిరి. ఇంతలో కొన్ని కలకత్తా, బొంబాయి మొదలగు పట్టణములనుండి పంతులుగారు ముప్పది స్మృతులకంటె నెక్కువగ దెప్పించి స్త్రీపునర్వివాహమున కనుకూలములగు ప్రమాణవచనములను సేకరింపఁగల్గిరి. అంతట జలింపని యుత్సాహముతోఁ బంతులుగారు కృషిచేసి పండితులసభలోఁ దమ ప్రతివాదమును చేయఁగా జనసామాన్యము విధవావివాహమునకు సుముఖముగాఁ జొచ్చెను. తర్వాత పండితులు బహిరంగముగాఁగాక మాయోపాయముచేఁ బరాజయము నొందించుట కనేకవిధముల యత్నించిరి. కొన్ని స్థలములందు సభలు జరుగుసమయమునఁ బంతులుగారియెడల దౌర్జన్యము చేయవలెనను నీచపద్ధతికిఁగూడఁ గొందఱు పూర్వాచార పరాయణులు యత్నములు చేసిరి.

ఆట్టిసమయములందుఁ బంతులుగారివద్దఁ జదువుకొనుచుండిన విద్యార్థు లాయన కంగరక్షకులుగనుండి యెట్టియపాయము లేకుండఁ జూచుచుండిరి. ప్రతిపక్షు లెన్ని యంతరాయములు గలిగింప యత్నించినను సత్యబలమును, దైవబలమును విధవావివాహవాదపక్షమున నుండుటచే గ్రమక్రమముగా బంతులుగారారంభించిన యుద్యమమునకు బలము చేకూరసాగెను.

అంతట పంతులుగారి యాజమాన్యమున స్త్రీపునర్వివాహసమాజ మొకటి కొలదిమంది సభ్యులతో స్థాపింపఁబడెను. అనేకులకు విధవావివాహములు శాస్త్రసమ్మతములనియు, అవశ్యాచరణీయములనియు నభిప్రాయము గలుగ నారంభించెను. బాలవితంతువుల సంరక్షకులనేకులు తమ వితంతుకన్యలకు పునర్వివాహములు చేయ నిశ్చయించుకొన మొదలుపెట్టిరి. వితంతుకన్యలు దొరకినపక్షమున దాము వివాహమాడెదమని గవర్నమెంటుకాలేజీ విద్యార్థులు కొందఱు సిద్ధపడిరి. వివాహసమయమున భోజనమునకు వచ్చుటకును గొందరు పెద్దమనుష్యులు పత్రముపై చేవ్రాళ్ళు చేసిరి.

వితంతువివాహముల జరుపుటకు ధనమవసరమగుఁగఁదోఁచెను. కాని పంతులుగారివద్ద ధనమేమియు లేదు. ఇట్టి క్లిష్టపరిస్థితిలో శ్రీ పైడా రామకృష్ణయ్యగారను వైశ్యశిఖామణులు తమయూరగు కాకినాడనుండి యేదోపనిమీఁద రాజమహేంద్రవరమురాఁగా వీరేశలింగముగారు వారిని కలిసికొని స్థితిగతులు వివరింపఁగా నీపనినిమిత్తమై ముప్పదివేల రూపాయల నిచ్చుటకు వారువాగ్దాన మొనర్చిరి. అంతట ద్విగుణీకృతోత్సాహముతో సమాజమువారు పనిచేయ నారంభించి వాద ప్రతివాదములకంటె కొన్ని విధవావివాహములు చేసి చూపవలెనని దృఢనిశ్చయులైరి. శ్రీపంతులుగారు న్యాపతి సుబ్బారావు పంతులుగారు, బసవరాజు గవర్రాజుగారు

ఆత్మూరి లక్ష్మీనరసింహముగారు, కొమ్మ రామలింగ
శాస్త్రులుగారు—వీరైదుగురు నొకయాంతరంగిక సమాజముగ
నేర్పడి రహస్యకార్యాలోచనము చేయఁదొడఁగిరి.

కృష్ణాజిల్లాలోని తిరువూరితాలూకా రేపూడి గ్రామ
మున నొకస్త్రీ బాలవితంతువగు తనకుమార్తెకు పునర్వివా
హము చేయఁదలఁచుకొన్నట్లుచటి తహస్సీల్దారుగారి వలనఁ
దెలిసికొని రహస్యముగా మనుష్యులనుబంపి యాచిన్నదానిని
బహుప్రయాసపై వీరేశలింగముగారు రాజమహేంద్రవరము
తెప్పించిరి. ఆవఱకుఁ జాలసంవత్సరములు పంతులుగారియింట
నుండి విద్యాభ్యాసముచేసి విశాఖపట్టణములో పోలీసుకార్య
స్థానమునఁ బనిచేయుచున్నట్టియు, నిరువదిరెండు సంవత్సర
ముల ప్రాయముగల్గి కళత్రవియోగము పొందినట్టియు గోగుల
పాటి శ్రీరాములనుయువకు నామెకుఁ దగినవరునిగ నేర్ప
ఱచి 1881 వ సంవత్సరము డిసెంబరు నెల 1 వ తేదీని తమ
స్వగృహములో పంతులుగారాంధ్రదేశమున మొదటిస్త్రీపునర్వి
వాహము జరపిరి. ఈవివాహము జరుగునని తెలిసినపుడు
పట్టణములోని సంక్షోభ మింతింతగాదు. ఎక్కడఁజూచినను
గోపవాక్యములే. ఎక్కడఁ జూచినను బెదరింపులె. ఇట్టి యా
టోపమునుజూచి పంతులుగారి ముఖ్యమిత్రులుగూడ వారితో
మాటలాడుటకు జంకుచుండిరి. అదివఱకు ప్రాణములైన
నిచ్చెదమని దంభములుపలికిన వారపుడా మార్గమునఁబో
వెఱచి చుట్టుత్రోవల నడచుచుండిరి. పాములభయమునఁజే

వంటకత్తె పంతులుగారియిల్లు విడచి పోయెను. పురోహితుఁడు రకమానుకొనెను. బంధువులందఱును వీరేశలింగముగారిని జాతిభ్రష్టుఁడని నిందింపసాగిరి. వివాహదినమునఁ బంతులుగారి యింటిచుట్టును పోలీసువారు కాపలాయుండవలసి వచ్చెను. ఇదివఱకెంతో సహకారులుగనుండిన బాపయ్యగారి నన్నదమ్ము లింటిలోనుంచి తాళము వేయుటచేతను, న్యాపతి సుబ్బారావుపంతులు గారింటివారి నిర్బంధముచేతను పెండ్లికి రాలేకపోయిరి. కొందఱు ధైర్యశాలురు తాంబూలములకేగాక భోజనములకును వచ్చిరి. కాని తగినంత నిర్బంధమేర్పడుటచే వారిలో గొందరు తర్వాత ప్రాయశ్చిత్తములఁ జేసికొనవలసి వచ్చెను.

ఇట్లు ప్రథమస్త్రీపునర్వివాహము నిర్విఘ్నముగా జరగినందున వితంతుబాలికలకు వివాహములు చేయఁదలఁచుకొన్నవారెందఱో రాజమహేంద్రవరము రాసాగిరి. అందుచే మొదటి వివాహమయిన నాల్గవదినముననే రెండవ వితంతు వివాహము జరిగెను. ఈవివాహములు జరగినసంగతి పత్రికలమూలమునఁ దెలిసికొని మదరాసు మొదలగు ననేకస్థలముల నుండి పంతులుగారి కెందఱో యభినందన పంజేశములను బంపిరి. రెండవవివాహము సందర్భమున జరగిన యూరేగింపునకు జిల్లాజడ్జి, జాయింటుమేజస్ట్రేటు, కాలేజిప్రిన్సిపాలు మొదలగు నైరోపీయులు సహితమూవచ్చి పెండ్లిండ్లకి వెంట

నడచిరి. అరువదిమంది పోలీసుభటులతో జిల్లా సూపరింటెండెంటు జనసమూహమును సరుదుచుండెను.

వితంతు వివాహప్రతిపక్షులు పంతులుగారి ననేక బాధలు పెట్టయత్నించిరి. శంకరాచార్య స్వాములవారిచేత బహిష్కారపత్రములఁ బంపించిరి. రెండవ పెండ్లికుమార్తె తల్లి మాత్రమే కుమార్తెను తీసికొనివచ్చి పెండ్లి చేయించుటచే వధువు తండ్రిచేత వ్యాజ్యము వేయింప యత్నించిరి. ఈ వివాహములకు వచ్చిన వారిని వారు కాఁపురమున్న యిండ్ల నుండి యజమానులు వెడలఁ గొట్టసాగిరి. నూతులలో నీరు తోడి కొనకుండను, పురోహితులను రానియ్యకుండను, దేవాలయములకు వెళ్ళనీయకుండను ననేకబాధలు పెట్టసాగిరి. మొగము ముందరనే తిట్టసాగిరి. ఉద్యోగములలోనున్న వారికి బదిలీలు చేయించియు, ఇతరవిధములను బాధింపఁజొచ్చిరి.

ఇది యిట్లుండగా మదరాసులోని కొందఱు ప్రముఖులు పంతులుగారి నానగరమున కాహ్వానించుచు నచట వారు స్వయముగఁ గొన్ని యుపన్యాసములు చేసినచో నచట ననేక వితంతువివాహములు జరుగునని వ్రాసిరి. అంతట శీతకాలపు సెలవులలోఁ బోవుటకు పంతులుగారు పయనమై కాకినాడపోయి గాలివానచే బ్రయాణము సాగకపోవుటచే వెనుకకు మరలిరి. కాని 1882 వ సంవత్సరపు వేసవిసెలవులలో ప్రథమవివాహదంపతులతోఁగూడ వీరేశలింగముగారు చెన్నపట్టణము వెడలిరి. అచట ననేకస్థలములందు స్త్రీపునర్వి

వాహములను సమర్థించుచు నుపన్యాసములిచ్చిరి. ఈయుప న్యాసములను స్త్రీపునర్వివాహశాస్త్రసంగ్రహమని పుస్తక రూపమునఁ బ్రకటించిరి.

అప్పటికి విధవా వివాహసమాజమున కొకనిధి యవ సరమని గుర్తించి శ్రీ పైడా రామకృష్ణయ్యగారి వాగ్దానము ననుసరించి వారిచే నొసఁగఁబడిన పదివేలరూప్యములను చెన్న పట్టణమునకుఁ బంపునట్లేర్పాటుచేసిరి. తర్వాత కొంతకాలము వఱకు వితంతూద్వాహములు జరగుట కష్టముగఁ దోఁచి పంతులుగారు విశేషవ్యయప్రయాసలకోర్చి పనిచేయవలసి వచ్చెను. వితంతువివాహము చేసికొనఁదలఁచిన విద్యార్థులకు జీతములు మొదలగునవి యిచ్చుటయేగాక వివాహముచేసి కొన్నవారికి పెండ్లిఖర్చులభరించి నివసించుట కిండ్లనిచ్చుచుం డిరి. కొంతశ్రమమైనను నెలకును, రెండేసి నెలలకును కొన్ని వివాహములు జరపి రాజధానినగరమగు మదరాసులోవితంతు వివాహములు కొన్ని జరిపినచో నెక్కువ ప్రచారమగునని తలఁచి యచటి మిత్రుల యాహ్వానముపై 1883 సంవత్స రము జూన్ నెలలో చెన్నపట్టణము పెండ్లికి సిద్ధముగనున్న వధూవరులతో చేరిరి. కాని యచట మొదట నుత్సాహము చూపిన మిత్రులు కొందఱాశాభంగము కల్గించినను పూని కతో వివాహమును వైభవముగాఁ బంతులుగారునెఱవేర్చిరి. చాలమంది పెద్దమనుష్యులు వివాహము చూడవచ్చి యత్యు త్సాహముతో కట్నములఁ జదివించిరి. మహావైభవముగ

జరపుటచేఁ జెన్నపట్టణపు వివాహమునకు 1671 రూప్యములు పంతులుగారు వెచ్చించిరి. నరసాపురము, బందరు, బళ్ళారి మొదలగు స్థలములందుఁ గొన్నివివాహములు జరపి నిధిని సమకూర్చుటకై పంతులుగారు తిరిగి చెన్నపట్టణము మొదలగు పట్టణములందు సంచారముచేయుటకై యొక విజ్ఞాపన పత్రము సిద్ధపఱచికొని 1885 వ సంవత్సరమున వీరేశలింగము గారు మదరాసుకు సకుటుంబముగ బయలువెడలిరి. అచట జడ్జీలు మొదలగు నున్నతాధికారులును, కొందరు జమీందారులును విరివిగ చందాలియ్యఁగా నాధనముతో సమాజమువారు నెలజీతము లియ్యవలసిన వారికిచ్చుచు, వివాహములు చేసికొన్నవారికి సహాయముచేయుచు మిగిలినదానితో వివాహములు చేయుచుండిరి. పంతులుగారిట్లు విశేషశ్రమలఁ బొంది స్త్రీపునర్వివాహముల జేయుచు 1907 వ సంవత్సరము నాటికి ముప్పదియైదు వివాహము లొనర్చిరి.

## 7. గ్రంథరచన

ఆధునికాంధ్రవాఙ్మయమునకు వీరేశలింగముపంతులు గారు జనకులని చెప్పుటయం దత్యుక్తి యేదియు లేదు. పందొమ్మిదవ శతాబ్దమునకుఁ బూర్వము తెలుఁగు వాఙ్మయము నానావిధముల వృద్ధి బొందియుండలేదు. అంతేగాక ధూ

కాలమునాఁటి కనేక కారణములచే నాంధ్రవాఙ్మయము వికృత
రూపముఁగూడఁ దాల్చుచుండెను. శ్రీకృష్ణదేవరాయల
కాలమునాఁటి పెద్దనాదులు రచించిన ప్రబంధము లుత్తమ
శ్రేణికిఁజెందిన గ్రంథరాజములై యుండఁగా వాని ననుకరింపఁ
జూచి ప్రతిభాశూన్యులగు కొందఱుకవులు పదునేడు పదు
నెనిమిదవ శతాబ్దములలో రసహీనములగు గ్రంథరచనకుఁ
బూనుకొనిరి. అవియైనను కల్లిబిల్లిగ నల్లఁబడిన పద్యగ్రంథ
ములేగాని జనసామాన్యాభివృద్ధి కుపయోగించు వచనగ్రంథ
ములుగావు. ఇదియిట్లుండఁ బందొమ్మిదవ శతాబ్దమున రాజ
పోషణచే నాంగ్లభాషాభ్యసనము వృద్ధిజెంది దేశభాషలు
వెనుకఁబడ నారంభించెను.

ఇట్టి విషమస్థితిలో శ్రీవీరేశలింగము గారావిర్భవించి
యాంధ్రసాహిత్యమునకు నూతనోజ్జీవనము గల్గించిరి. వాఙ్మ
యమున మహాకృతములఁ బంతులుగా రవలంబించనిశాఖ
యేదియులేదు. మనదేశమునం దనుశ్రుతముగ వచ్చుచున్న
కావ్యనాటకఫణితులనేగాక, అప్పటికి మనదేశముతో సంబంధ
మేర్పడిన యాంగ్లేయుల సాహిత్యాభివృద్ధినిగూడ నాదర్శ
ముగఁ దీసికొని యాంధ్రవాఙ్మయము ననేకవిధములఁ బం
తులుగారు పోషించిరి. అందుచేఁ బందొమ్మిదవ శతాబ్దము
చివరిభాగ మాంధ్రసాహిత్యచరిత్రలో 'వీరేశలింగయుగ'మని
పేరొందుట యెంతయు సమంజసముగనున్నది. వీరేశలింగము
గారికి బాల్యమునుండియు నాంధ్రభాషాకావ్యపఠనమునం దభి

లాభమెందుగనుండెనని మనమిదివఱకే తెలిసికొనియున్నాము. మూఁడవతరగతి చదువుచున్నపుడే యాకాలమున ఓగిరాల జగన్నాథముగారు నూతనముగా రచించిన సుమనోమనోరంజనమను ప్రబంధమును గాగితములపైఁ బంతులుగారు వ్రాసికొనిరని తెలిసికొన్నపుడు వారికిఁ దెలుఁగునందుఁగల యాసక్తి తెల్లమగును. ఆంధ్రకావ్యములలోనెల్ల వసుచరిత్ర ముత్తమమైనదని చెప్పుకొనుటవిని యెట్లయిన నాకావ్యమును బఠింపవలెనని వీరేశలింగముగారి కాకాలముననే యుద్దేశము కలిగెను? ఒకనాఁడు మెల్లగాఁ దల్లిని సమీపించి వసుచరిత్రను కొనిపెట్టుమని వీరేశలింగముగారడుగఁగా నది పాఠపుస్తకము కాదని యామె యెఱిఁగి యందులకు నిరాకరించెను. కాని యాకావ్యము చదువవలెనన్న యాశమాత్రము వీరేశలింగముగారిని విడువలేదు. అప్పుడా గ్రంథము వెల నాలుగురూపాయల యెనిమిదణాలు. ఆసమయమున నాయనవద్ద నెనిమిదణాలుమాత్రముండగా నొకయుపాయము తోఁచెను. పుస్తకము లమ్మువానివద్దకువెళ్ళి తక్షణమే యెనిమిదణాలిచ్చెదననియు తర్వాత నెల కెనిమిదణాలుచొప్పునఁ దీర్చెదననియు నేర్పాటుచేసికొని పుస్తకము తీసికొనిరి. అప్పటినుండి ప్రతిదినమును వీరేశలింగముగారు వేళకు భోజనముచేసి పాఠశాలకుఁ బోవుచున్నట్లు నటించుచు బడి జీతమునకు నెలనెలకును దల్లియిచ్చుచున్న యెనిమిదణాలును పుస్తకవిక్రేత కిచ్చివేసి యాతనియంగడిలో కూర్చుండి వసుచరిత్రను జదువుచుండిరి.

కాని రెండు నెలలకీవిషయ మాతనితల్లిఁ దెలిసికొని మందలించి, ధనమును మరియొకవిధమున వ్యర్థపఱుపక పుస్తకపఠనమునకు వినియోగించునందుకు సంతోషించి వసుచరిత్రకుఁ బూర్తిగ మూల్యమిచ్చి కొనిపెట్టెను.

వీరేశలింగముగారు పాఠశాలలో జదువుచుండిన కాలముననే తెలుఁగుకవిత్వము చెప్పనారంభించిరి. స్వతస్సిద్ధముగ భక్తుఁడగుటచే విద్యార్థిదశయందుగూడఁ బ్రతిదినమును గోపాలస్వామి యాలయమునకును, మార్కండేయస్వామి యాలయమునకును బోవుట యాయనకాచారముగ నుండెను. కవిత్వముచెప్పుట కారంభింపఁగనే మొట్టమొదట గోపాలస్వామిమీఁద నొకటియు, మార్కండేయస్వామి మీఁద నొకటియు శతకముల నాయన రచించిరి. ఆరెండుశతకములును దర్వాత నశించుటచేఁ బ్రకటింపబడలేదు. గోపాలస్వామినిగూర్చి వ్రాయఁబడిన పద్యములలో నొకటిమాత్రము మిగిలియున్నది.

క. శ్రీరమణీహృల్లోలా
కారుణ్యలతాలవాల కాంచనచేలా
ఘోరాహవజయశీలా
శ్రీరాజమహేంద్రవరపురీ గోపాలా.

పాఠశాలలో విద్యార్థిగనున్నపుడే చాలసార్లు పాఠగ్రంథముగఁ జదివిన నలచరిత్రను దెలుఁగుభాషలోఁ జంపూ

కావ్యముగా రచింపఁబూని క్రొత్తత్రోవను ద్రొక్కి యనేక కఠినబంధముల నేర్పఱచుకొని శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన నైషధము పంతులుగారును రచించిరి. అచ్చ తెనుఁగుభాషలో ఓష్ఠ్యములు (పెదవులయందు పుట్టిన పఫబభమ అను నక్షరములు) వచ్చనమును లేకుండునట్లు నలునికథను బద్యగ్రంథముగ వ్రాసిరి. ఇదితర్వాత బి. ఏ. పరీక్షకుఁ బఠనీయగ్రంథముగ యూని వర్సిటీ వారేర్పఱచిరి. కవిత్వరీతి క్రిందిపద్యములవలనఁ దెలియ నగును.

సీ. ఎల్లచో నారాక కెదురు చూచుచునుండు
నెలఁతుక యెదనెంతతలఁకె నొక్కో!
యేరేయి నన్నొంటి నిలుదాఁట నీకుండు
కన్నతల్లియ దెంతకలఁగె నొక్కో!
తోడునీడలలాగు తొలఁగని చెలికాండ్రు
సోలినన్నన కెంత తూలిరొక్కో!
నేఁజేరుటయె తేంగి నెనరునఁ జనుదెంచు
కొడుకులు తారెంత కుందిరొక్కో!

కూడియెల్లరిది తెలిసికొన్నయంత
కటకటా! తాళ! నీచేతఁ గడకునేఁడు
చిక్కఁగాఁజేసినే నెద్దిచేయుదింకా!
హాళినేనక్కలుజ్జేఁడ, నేననఁడనైతి.

చ. చిలుకలకొల్లి యక్కరణిఁ జెన్నుగఁజుట్టలయొద్దనుండి యున్
నలునెదలోఁ దలంచుచు ననల్ తలఁదాల్చక నేలసెజ్జగా
నలయరచీరతో నొడలనంటి తొరంగనిధూళితోఁగనుం
గొలఁకులనీటితో నెసఁగెఁ గూరుకుచెందనికన్నుదోయితోన్

పిదప మెట్రిక్యులేషన్ పరీక్షకుఁ జదువుచుండినకాలమున వీరేశలింగముగారు రసికజనమనోరంజనమను నైదాశ్వాసముల శుద్ధాంధ్రప్రబంధము రచించిరి. ఇది ఎఫ్. ఏ. పరీక్షకు పాఠ్యగ్రంథముగ నిర్ణయింపఁబడెను. అచ్చతెనుఁగున వ్రాయఁబడినను శైలిధారాళముగను సహజముగను నున్నది.

సీ. కప్పుకొప్పులనుండి కారుచుండెడునీరు
చిఱుతమబ్బులవాన చినుకులట్లు
గబ్బిగుబ్బలనుండి కారుచుండెడు నీరు
బలితంపుమలలఁ బెన్వాకలట్లు
కమ్మమోములనుండి కారుచుండెడునీరు
సొగసు చందురుమంచు సోనలట్లు
కలికి కన్నులనుండి కారుచుండెడునీరు
నెత్తమ్మిపూవుఁ దేనియలట్లు
వా తెరలనుండి తగఁజాలువారు నీరు
పలుచనగు దొండపండుల పాలయట్లు
వింతవింతలఁ దనరెఁ గన్విందుగాఁగ
లేమలటనీటిలో మున్గి లేచునపుడు.

గీ. పడఁతిమిన్నలు కొలకు వెళ్లెడునప్పు
డొడల నంటిననీటి బొట్లొప్పుమీఱె
నేవళంబుగ బెరుఁగు క్రొందీవగములు
మొగ్గతొడిగినకైవడి ముద్దుగులుక.

శా. నేలంగల్గుపులుంగులెల్ల నెపుడున్ జెల్వారఁబల్కంగ, నే
నేలాపల్కఁగ నేరనైతినని యెంతేగెంపుకన్బ్బల్గుతా
లోలోనందలపోసి నేర్చి నవలాలోఁజేరి కాదంటిరే
నేలాకోయిల పల్కులంద్రు వినువారెల్లంబువుంబోడికిన్.

1872 వ సంవత్సరమున బందరునుండి వెలువడుచుండిన పురుషార్థప్రదాయినిలో పంతులుగారు శుద్ధాంధ్రోత్తర రామాయణము రచించి ప్రకటించిరి. ఇదియు చాలమంది పండితులచే కొనియాడఁబడి పంతులుగారి కభినవతిక్కన మొదలగు బిరుదుల సంపాదించినది. కోరంగిపాఠశాలలో బని చేయుచుండిన కాలముననే సంగ్రహవ్యాకరణమును, నీతిదీపిక యను పద్యగ్రంథమును వ్రాయఁబడినవి. సంగ్రహవ్యాకరణము ఇంగ్లీషుపద్ధతి ననుసరించి బాలురకు సులభముగ బోధపడునట్లు వర్ణపరిచ్ఛేదము, పదపరిచ్ఛేదము, వాక్యపరిచ్ఛేదము, కావ్యపరిచ్ఛేదము అనుభాగములు గల్గియున్నది. అదివఱలో దెలుఁగుభాషలో వ్రాయఁబడిన వ్యాకరణములు సంజ్ఞాపరిచ్ఛేదము, సంధిపరిచ్ఛేదము మున్నగు భాగములతో నేర్పడియుండుటచే వానియందలి సాంకేతికపదములు బాలు

రకు సులభముగ నర్థము కాకుండెను. పంతులుగారి సంగ్రహ వ్యాకరణము పాఠశాలలందుంచఁబడుటచే మిగులఁ బ్రచార ములోనికి వచ్చెను. నీతిదీపిక సులభశైలిలో ముఖ్యమగునీతుల బోధించునదై యున్నది.

గీ. అన్నవస్త్రాదులకునైన నధికమైన
భోగభాగ్యంబులకునైన భూమిమీఁద
నొరులనె నమ్మికొనియెప్పు నుండరాదు
తనదుచేతుల నమ్మంగఁ జనునుగాని.

ఆ. వె. పరులు నీకునెట్లు వాంఛింతురో చేయఁ
బరుల కట్లుచేయువలయు నీవు;
సర్వశాస్త్రములను జర్చింపఁదేలెడు
సారమైనధర్మ నరణియెపుడు.

తెలుఁగులో వచనకావ్యములంతగా లేవు. కనుకఁ బద్యకావ్యములకంటె వచనకావ్యములు వ్రాయుటయెక్కువ యుపయోగకరమని నిశ్చయించుకొని పరవస్తు చిన్నయసూరి గారు వ్రాసిన నీతిచంద్రికలో నుత్తరార్థమును (విగ్రహము; సంధి) పంతులుగారు రచించి 1874 వ సంవత్సరములో ముద్రింపించిరి. చెన్నపురి క్రైస్తవకళాశాలయందు దేశ భాషాపర్యవేక్షకులుగ నుండిన సమర్థి రంగయ్యసెట్టి మొద లగు వారాగ్రంథమును శ్లాఘించి తమకళాశాలలో పాఠ్య

పుస్తకముగ నేర్పఱచిరి. ఇంకను మఱికొందఱు ప్రముఖులు గూడ నీగ్రంథము నెంతయు మెచ్చుకొనిరి. యూనివర్సిటీ వారు దీనిని మెట్రిక్యులేషన్ పరీక్షకుఁ బఠనీయగ్రంథముగ నిర్ణయించిరి.

తెలుఁగులో వచనప్రబంధమును వ్రాయఁబూనుకొని పంతులుగా రాంగ్లభాషలో గోల్డుస్మిత్ వ్రాసిన వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డు అను నవల నాధారముగఁ జేసికొని తెలుఁగులోనికి కొంతవఱకు భాషాంతరీకరణము చేసిరి. అట్లనువదించుట కంటె స్వకపోలకల్పితమగు వచన ప్రబంధము వ్రాయుటయే బాగుండునని పిదప నిశ్చయించుకొని, రాజశేఖరచరిత్రమును రచించిరి. మనసంఘములోఁగల మూఢవిశ్వాసములనుపోగొట్ట వలెనను నుద్దేశముతో వీరేశలింగముగారు రాజశేఖరచరిత్ర రచించి సామాన్యసంసారపద్ధతులను గండ్లకుఁ గట్టినట్లుచిత్రించి యున్నారు. దీని ప్రాశస్త్యమును గుఱించి కొందఱాంగ్లే యులు దీనిని ఆంగ్లభాషలోని కనువదించి Fortune's Wheel అను పేరుతో చిత్రపటములఁజేర్చి లండను నగర మున 1887 వ సంవత్సరమునఁ బ్రకటించిరి.

రాజశేఖరచరిత్రము శైలివిషయమునను, కథావస్తువు విషయమునను నూతనమార్గమును ప్రదర్శించి వాఙ్మయము నందలి యొక ముఖ్యమగు కొఱఁతనుదీర్చి సాహిత్యమున కలం కారప్రాయమైనదనుట నిర్వివాదాంశము. ఈగ్రంథమును రచిం చిన పిదప వీరేశలింగముగారినిగూర్చి చెన్నపురియందలి

హిందూపత్రిక వెలువఱచిన క్రిందియభిప్రాయమెట్టి యతిశయోక్తిలేని వాస్తవవిషయమని చెప్పవచ్చును.

'We sincerely hope that Mr. Veeresalingam will be long spared to his country and by his laudable efforts create an oasis in the banch desert of Telugu literature.

We picture to ourselves a period in the history of TeluguLiterature when the country will look backwith prideto the man who in the midst of anignorant multitude and indifferent public, and during times when the study of the English language was at premium and vernaculars at discouut, stood alone from the English -learning propensities of his country-men, laid the foundation stone of Modern Literature and led the way in developing the latent powers of the language into harmony and perfection.

(వీరేశలింగముగారు దేశముకొఱకుఁ జిరకాలము క్షేమముగ నుందురనియు, తమ సంస్తవనీయమైన ప్రయత్నముల దెలుఁగు వాఙ్మయమనెడి నిస్సారపు టెడారిలో నొక ఫలవంతమైన ప్రదేశము నిర్మింతురనియు మేము మనస్ఫూర్తిగఁ గోరుచున్నాము.

మూఢదశలోనున్న ప్రజాబాహుళ్యముయొక్కయు, ఉపేక్షాపరులైన మహాజనులయొక్కయు మధ్యమున, ఆంగ్ల

విద్య లాభకరముగను, దేశభాషా విద్యాభ్యసన మలాభకరముగను నున్నకాలములోఁ దనదేశీయుల ఆంగ్లవిద్యావ్యామోహామునుండి తప్పించుకొని, ఆధునిక వాఙ్మయనిర్మాణమునకు శంకుస్థాపనముచేసి భాషయొక్క నిగూఢశక్తులను, పొందికను, పరిపూర్ణతను, వర్ధిల్లఁ జేయుటలో నెవఁడు మార్గదర్శకుఁడయ్యెనో యాపురుషుని గర్వముతో స్మరింపఁగల కాలమును మేము మామనసునఁ జిత్రించుకొనుచున్నాము.)

శృంగార ప్రబంధములు భాషకు మేలుకంటె కీడు నెక్కువగఁ జేయునను నభిప్రాయమును బొందినవారై ప్రబంధములను రచించురీతిని బరిహాసము చేయవలెనన్న యుద్దేశముతో నభాగ్యోపాఖ్యానమను హాస్యగ్రంథమును పంతులుగారు రచించిరి.

1878 లో శుద్ధాంధ్రభారతసంగ్రహమును వీరేశలింగముగారు వ్రాసి ప్రకటించిరి. ఇది ఎఫ్. ఏ. పరీక్షకు పఠనీయగ్రంథమయ్యెను. అందలి పద్యమొకటి యుదహరింతము.

ఉ. హత్తులగత్తలానులను నందపురోవిరి బోండ్లజాళువా
మొత్తముదెచ్చిఇచ్చినతమున్నదిమెచ్చుచుఁగొల్చుచుండుదుర్
క్రొత్తగనాల్గు సంద్రములకున్ నడుమంగలరాచసింగముల్
మొత్తములై యటంగొలువులోపలనొప్పెడునేలదాలువున్

నన్నయవ్రాసిన క్రిందిపద్యమున కిది యచ్చతెలుఁగు.

మ. మదమాతంగతురంగ కాంచనల సన్మాణిక్యగాణిక్య సం
పదలోలింగొని తెచ్చియిచ్చి ముదమొప్పంగాంచిసేవించిర
య్యుదయాస్తాచల సేతుశీతనగ మధ్యోర్వీపతుల్సంతతా
భ్యుదయుంధర్మజుదత్సభాస్థితు జగత్పూర్ణప్రతాపోదయున్

శుద్ధాంధ్రోత్తర రామాయణమును పంతులుగారిచే రచింపఁబడెను.

కొన్ని గ్రంథములిట్లు రచించిన పిదప గ్రంథములు సాధారణముగ సలక్షణమైన సులభశైలిని రచించుటయే గాక విషయాను గుణముగా తత్తదుచితరీతిని గ్రామ్యభాష యందు సహితము గ్రంథములు వ్రాయవచ్చునను నభిప్రాయ మేర్పఱచుకొనిరి. అతిబాల్యవివాహము, వృద్ధవివాహము, కన్యాశుల్కము మొదలగు దురాచారము లనర్థదాయకము లని చూపుటకుఁ జమత్కారముగా బ్రాహ్మవివాహమను గ్రంథమును బంతులుగారు గ్రామ్యభాషలోఁ బ్రచురింపఁగా నది పండిత పామరులనియు స్త్రీపురుషులనియు భేదములేక యందరిచేతను నాసక్తితోఁ జదువఁబడసాగెను. వ్యవహార ధర్మబోధిని యనునదిగూడ నట్టిగ్రంథమే. ఇందు న్యాయవా దుల యక్రమములు వర్ణింపబడినవి. అపూర్వబ్రహ్మచర్య ప్రహసనము, మిత్రవివాహప్రహసనము, మహాబధిరప్రహ సనము, పునర్మరణప్రహసనము, బలాత్కారగాన వినోద ప్రహసనము, మహామహోపాధ్యాయప్రహసనము, మహావం

చకప్రహసనము—మొదలగు హాస్యరసప్రధానములగు వాటి నెన్నిటినో వ్రాసి భాషాసంస్కరణమునకు, సంఘసంస్కరణమునకును బంతులుగారు బునాది వేసిరి.

1880 వ సంవత్సరమున శ్రీహర్షుఁడు సంస్కృతమున రచించిన రత్నావళినాటికను, షేక్స్పియరు ఇంగ్లీషున రచించిన Comedy ef Errors నాటకమును దెనిఁగించి రాజమహేంద్రవరమున నాటకశాలలో బంతులుగారుప్రదర్శింపించిరి.

1883 నాఁటికిఁ బంతులుగారు కాళిదాసు సంస్కృతమున వ్రాసిన శాకుంతలమును దెనిఁగించిరి. శైలి దెలియుటకు రెండుపద్యము లుదాహరింపఁ బడుచున్నవి.

చ. చల్లనివై శ్రమం బుడుపఁ జాలిన తామరపాకువీవనల్
మెల్లనఁగొంచువీచుదునో మిక్కిలి శీతలమైనవాయువున్
సల్లలితారుణాబ్జసదృశంబగు నీచరణద్వయంబు నో
పల్లవపాణి! నాతొడలపై నిడి హాయిగ బట్టువాడనో?

చ. కొండలమందెడొందము శకుంతలతానిపుడేగునంచయో
క్రందుగబాష్పరోధమునగంఠమునుంజెడెదృష్టిమాంద్యమునుం
బొందె; నొకింతపెంచినతపోధనుడేయిటులుగుంద నెంతగాఁ
గుందుదురోతమంతగనుకూతులబాయుగృహస్థులక్కటా!

పిదప మాళవికాగ్నిమిత్రము, ప్రబోధచంద్రోదయము మొదలగు సంస్కృతనాటకములను వీరేశలింగముగా రాంధ్రీకరించిరి. ప్రబోధచంద్రోదయమందలి కఠినశైలికిక్రింది పద్య ముదాహరణముగ నున్నది.

శా. ధారాయంత్రపతజ్జలోదిత నితాంతధ్వాన సంయుక్తముల్
నీరేజారికర ప్రభాధవళముల్ చెల్వొందు సౌధాగ్రముల్
భూరిప్రేక్ష్యములై శరద్ధవళ జీమూతాంతరాజత్తటి
చ్ఛ్రీరమ్యంబు లవేవతాకలెసగంజిత్రద్యుతి న్మేడలన్.

అనంతరము ప్రహ్లాదనాటకము, రాగమంజరి, దక్షిణ గోగ్రహణనాటకములను వ్రాసి 1889 లో హరిశ్చంద్ర నాటకము ప్రకటించిరి.

1883 లోఁ బంతులుగారు స్త్రీలయుపయోగార్థమై సతీహితబోధినియను పత్రిక నారంభించి 1884 లో చంద్రమతీచరిత్రము, 1887 సత్యసంజీవని యను గ్రంథములు వ్రాసిరి.

మనవారు స్త్రీలవిషయమై చేయునన్యాయముల తేటపడునట్లుగా వ్యాజగీతిని సత్యరాజాపూర్వదేశయాత్రలు అను గ్రంథము ఆంగ్లభాషలోస్విఫ్టువ్రాసిన Gulliver's Travels అను దాని ననుసరించి పంతులుగారు వ్రాసిరి. సత్యరాజాయాత్రలు కన్నడ,ఆంగ్లభాషలలోనికి మార్పఁబడెను. 1889లో స్త్రీలకొఱకు దేహారోగ్యధర్మబోధినియు, 1896 లో పత్ని

హితసూచనియుఁ గూడఁ బంతులుగారు వ్రాసియుండిరి. స్త్రీనీతిదీపిక, సత్యాద్రౌపదీ సంవాదము, మాతృపూజ, అనునవి యిట్టిగ్రంథములలోనివి మరికొన్ని.

ఇంగ్లీషులో Lamb వ్రాసిన షేక్స్పియరునాటక కథలనుబట్టి యందలి పాత్రలను, ఆచారములను మనదేశమున కనువగునట్లుమార్చి కురంగేశ్వరచరిత్రము, మాలతీమధుకరము, చమత్కారరత్నావళి, గయ్యాళిని సాధుచేయుట, కుమారద్వయవిలాసము, మొదలైన పదునారు కథలను సులభమగు వచనములో పంతులుగారు వ్రాసిరి.

తెలుఁగుభాషలో శాస్త్రగ్రంథము లెక్కువగా లేని లోపములను దీర్చుటకై పదార్థవివేకశాస్త్రము, శారీరశాస్త్రము, జ్యోతిశ్శాస్త్రసంగ్రహము, జంతుశాస్త్రము మొదలైనవి రచించిరి. మనదేశపు ప్రాచీనగ్రంథములగు శుశ్రుతము మొదలైనవియు, పాశ్చాత్యగ్రంథములును పరిశోధించుటయేగాక మనుష్యకంకాళమును తయారుచేయించుకొని విశేషప్రయత్నప్రయాసలుపొంది పంతులుగారు శారీరశాస్త్రమును రచించిరి.

కావ్యసంగ్రహము, అలంకారసంగ్రహము, తర్కసంగ్రహము మొదలైనవియు సంస్కృతగ్రంథములను బట్టి యాంధ్రమున వీరేశలింగముగారిచే రచింపఁబడెను.

పంతులుగారు వ్రాసిన గ్రంథములలోనెల్ల నాంధ్రకవుల చరిత్రము చాల ముఖ్యమైనది. పూర్వకవులు, మధ్యకవులు,

ఆధునికకవులు అను విభాగములతో సుమారు రెండువందల కవులజీవితములను బంతులుగారు వ్రాసియుండిరి. ఆకాలమున నిట్టి కవులచరిత్ర వ్రాయుట చాల కష్టమైనపని. అందును కవుల కాలనిర్ణయము చేయుటయం దాంధ్రకవులచరిత్రగ్రంథ కర్త పడినశ్రమ యింతయని చెప్పశక్యముగానిది. శాసన పరిశోధనమును, మదరాసు మ్యూజియమునందలి చరిత్రాధారముల పరిశీలనయు, చరిత్ర గ్రంథపఠనమును, పంతులుగారు విశేషశ్రమకోర్చి చేయవలసివచ్చెను. అంతేగాక మైసూరు, తంజావూరు మొదలగు స్థలములకుఁబోయి విషయములను సేకరింపవలసివచ్చెను. పైకి చూచువారికీ గ్రంథరచనయందు పంతులుగారు పడినశ్రమ గోచరింపక పోవచ్చునుగాని యా కాలపుస్థితిగతులలో నాయన యెన్నిబాధలకోర్చి యట్టియుద్గ్రంథమును మొట్టమొదటిసారిగ రచించిరో యూహింపశక్యముగాదు.

సత్యవాదినియను పేరనద్వైతమతసంగ్రహము, విశిష్టాద్వైతమతసంగ్రహమును, ద్వైతమతసంగ్రహమును గూడ రచించి ప్రకటించిరి.

పాఠశాలావిద్యార్థులకొఱకు వీరేశలింగముగారునూతన పద్ధతుల ననుసరించి వాచకపుస్తకములను వ్రాసియుండిరి. ఇవన్నియు నట్లుండఁ బంతులుగారు తమ జీవితకథనంతను స్వీయచరిత్రగ వ్రాసి ప్రకటించిరి.

ఇట్లు వీరేశలింగముపంతులుగా రాంధ్రభాషావిషయ మునఁ జేసిన సేవ యపారము. సాహిత్యవిషయమున వారు త్రొక్కనిత్రోవలేదు. అట్లుచేయుటలో వారన్నిటియందును నరిక్రొత్తగనే యారంభము చేయవలసియుండెను. ఒకరి జీవితములో నింతవైవిధ్యముతోఁ గూడిన యిన్నిగ్రంథములు రచింపఁబడుట కేవలమీశ్వరవిలాసమేగానిమఱియొకటిగాదు. ఒకయాంధ్రవాఙ్మయమునకేగాక పంతులుగారురచించినగ్రంథ సముదాయము ప్రపంచమునందేవాఙ్మయమునందైన నాశ్చర్యము గొల్పదగినదై యున్నది. వీరేశలింగకవి గ్రంథావళి యొక్క సంపుటములు లోకమున దెలుఁగుభాష మాట్లాడఁ బడునంతకాలమును శాశ్వతమగు విలువఁగలదై యెప్పటి కప్పుడే నూతనత్వము గనఁబఱచుచు నాంధ్రజాతికిఁ బ్రబోధము గల్గింపఁ జాలినదై యుండఁ గలదనుట నిశ్సంశయమగు నంశము.

## ౮. విద్యాపోషణము

వీరేశలింగము పంతులుగా రుపాధ్యాయవృత్తిప్రధాన ముగఁ జేసికొని జీవితము గడపియుండుటచే వారిజీవితకాలము ముఖ్యముగ విద్యాభివృద్ధికై వినియోగింపఁ బడినది. వృత్తి వలన విద్యాభివృద్ధికిఁ దోడ్పడుటయేగాక వారు స్థాపించి పోషించిన విద్యాసంస్థలనేకము గలవు.

స్త్రీవిద్యాభివృద్ధికై పంతులుగారు చేసిన కృషిని గూర్చి కొంతవఱ కిదివఱలోఁ జదివియుంటిమి. 1874 వ సంవత్సరమునఁ బంతులుగారు ధవళేశ్వరములో ప్రధానోపాధ్యాయులుగ నుండిన దినములలో బాలికల యభివృద్ధికొఱకు జరిగిన సభలకు ఫలితముగ నచటి ప్రముఖులు కొందఱుచందాలు వేసికొని యొకబాలికాపాఠశాలను స్థాపించి చాలకాలము నడపిరి. ఇదిపంతులుగారి ప్రోద్బలమున నేర్పడిన సంస్థ యేయని వేఱుగఁ జెప్పనక్కఱలేదు.

1880, 81 వ సంవత్సరములలోఁబంతులుగారు స్థాపించిన ప్రార్థనాసమాజము చురుకుగా బనిచేయుటచే నాయుత్సాహఫలితముగఁ బంతులుగారి మిత్రులగు ఏలూరి లక్ష్మీనరసింహముగారు రాజమహేంద్రవరమున పరిశుద్ధాస్తిక పాఠశాల నొకదాని నారంభించిరి. వీరేశలింగము పంతులుగారును దాని కార్యక్రమమున మొదటఁ బాల్గొనిరి. కాని దానిని నడపుటలో నభిప్రాయభేదము లేర్పడుటచే గార్యనిర్వాహకులలో రెండుశాఖ లేర్పడినవి. ఆరంభమునుండియు బరిశుద్ధాస్తిక మతసిద్ధాంతముల నాపాఠశాలలో బోధింపవలెనని వీరేశలింగముగారి యభిప్రాయము. పాఠశాల బలపడిన పిదప క్రముముగా నట్టి విషయముల నేర్పవలెనని లక్ష్మీనరసింహముగారి యుద్దేశమునై యుండెను.

1881 వ సంవత్సరమున పండిత శివనాథశాస్త్రిగారు రాజమహేంద్రవరమున నిచ్చిన యుత్తేజకరములగు నుపన్యా

సముల ఫలితముగ విద్యార్థులయం దుత్సాహమధికమై యెన్నియో రాత్రిపాఠశాలలు స్థాపింపఁబడెను. పంతులుగారు విద్యార్థుల నిట్టి సత్కార్యములందు ప్రోత్సహించుచు సాహాయ్యము చేయుచుండిరి. పిదప నొకబాలికాపాఠశాల స్థాపింప వలెనని విద్యార్థులయం దుత్సాహమేర్పడఁగా వారిపక్షమునఁ బంతులుగారు పనిచేసి మిత్రులచేఁ జందాలు వేయించి యిన్నీసుపేటలో నొకబాలికాపాఠశాలను స్థాపించిరి. అది క్రమముగ వృద్ధియై కొంతకాలము మునిసిపాలిటీ వారియాధిపత్యమున నడుపఁబడి తుదకు గవర్నమెంటు వారి యధికారమునఁ జేరినది.

ఆకాలమున రాజమహేంద్రవరమున బాలుర విద్యాభివృద్ధికై స్థాపింపఁబడిన పాఠశాలలును సధమస్థితియందె యుండెను. పేరు సంపాదింపవలెనని కొందఱు, ధనము సంపాదింపవలెనని కొందఱు నాస్తికపాఠశాల, స్వదేశాభిమాని పాఠశాల మొదలగుపేర్లతో నెన్నియోపాఠశాలల స్థాపించి పోటీ పడి తమతమ పాఠశాలల కెక్కువమంది విద్యార్థుల నాకర్షించుటకై యోగ్యతలేనివారినిపై తరగతులలోఁ జేర్చుకొనుట, తక్కువజీతములు పుచ్చుకొనుట మున్నగు తంత్రములు పన్ని యుపాధ్యాయులకు వాస్తవముగ తక్కువ జీతములిచ్చి తప్పు లెక్కలఁ జూపి ప్రభుత్వమునుండి యెక్కువ గ్రాంటును తీసికొని పాఠశాలా కార్యనిర్వాహకు లక్రమలాభము బొందుచుండిరి. అప్పటి నిబంధన లంతకఠినముగ లేకపోవుటచే నిట్టి

యవినీతిచర్యల నరికట్టుట కష్టముగ నుండెను. అట్టిస్థితిలోఁ బాఠశాలాకార్యనిర్వాహక సంఘసభ్యులుగ నుండిన వీరేశలింగముగా రధ్యక్షులగు మెట్కాఫుగారి సాహాయ్యముతో వివిధపాఠశాలల యజమానులతో మాట్లాడి వారి కనుకూలము లగు షరతులపైననే యాపాఠశాలల నన్నిటిని కలిపి యొకే పాఠశాలగఁజేసి సక్రమముగ నడిపింపఁగల కార్యనిర్వాకసంఘపుటాధిపత్యమునకుఁ దెచ్చిరి. ఇట్లు కలుపఁబడిన నూతనోన్నతపాఠశాలకుఁ దగినభవననిర్మాణమునకై పట్టణమధ్యమున విశాలస్థలమును కొనుటకు నిర్ణయము చేసికొనఁగా నీవిషయమాపట్టణపు తహాస్సీల్దారు తెలిసికొని తంత్రముచేసి యాస్థలముతనబంధువుల పేరఁగొనుట కేర్పాటు గావించుకొనెను. ఈ విషయము తెలియఁగనే వీరేశలింగముగారు సబ్ కలెక్టరుతో మాట్లాడి యాస్థలము నున్నతపాఠశాలకు వచ్చునట్లేర్పఱచిరి. ఈస్థలమున ప్రస్తుతము గవర్నమెంటు ట్రెయినింగు కాలేజీ యున్నది.

వీరేశలింగముపంతులు ప్రెసిడెన్సికాలేజి పండిత పదవి నుండి పించను తీసికొని రాజమహేంద్రవరము తిరిగి వచ్చిన వెంటనే 1905 వ సంవత్సరము జనవరి 16 వ తేదీని విక్టోరియా బాలికా పాఠశాలయను పేరుతో నొక సంస్థను దమ విశాలగృహమున నారంభించిరి. హితకారిణీశరణాలయమునందలి వారికిని విద్యాభిరుచిగల కులస్త్రీలకొఱకును బాలికలకొఱకును నీపాఠశాల యుద్దేశింపఁ బడినది. ఆరంభమున పాఠశాల వలు

గురు విద్యార్థినులతో మొదలిడినను సంవత్సరాంతమునకు నూటయేఁబదియయ్యెను. క్రమముగా నిది వృద్ధియై యాఱుగు రుపాధ్యాయులను లిందు నియమింపఁబడవలసిన యవసరము గల్గెను.

సత్కార్యబీజములను హృదయక్షేత్రములందు నా టించి సఫలములగునట్లు చేయుటకై బాల్యావస్థయే యుత్తమ మైనది. అందుచేత బాలురకు భగవద్భక్తియు, పరోపకారా సక్తియు బోధించెడు పాఠశాల యుండినయెడల శీఘ్రకాల ములో దేశాభివృద్ధి గల్గునని పంతులుగారి నమ్మకము. విద్యా ర్థుల హృదయములలో సదుద్దేశముల బుట్టించుటకుఁ దగిన శక్తి సామర్థ్యములును, శ్రద్ధాభక్తులునుగల యుపాధ్యాయు లవసరము. అట్టి యుపాధ్యాయులను సమకూర్చి యొకయా స్తికపాఠశాలను స్థాపింపవలెనని యుద్దేశించి పట్టపరీక్షయందు చదువుచుండిన కొందఱిని ప్రోత్సహించుటయేగాక ప్రతిసంవ త్సరమును సైదాపేటయందు ట్రెయినింగు పొందుట కిద్దరను బంపుటకును పంతులుగారు నిశ్చయించిరి. కొంద ఱుదార స్వభావముగలవారు వేలదరబడి విరాళములనుగూడ నొసఁ గిరి. ఈసమయముననే (1893 వ సంవత్సరమున) రాజమ హేంద్రవరమునఁ గొన్ని మధ్యమపాఠశాలలను గవర్నమెంటు వారు స్థాపింప యత్నించుచుండుటచేఁ బంతులుగారపు డెంత కృషి చేసినను మధ్యమపాఠశాలా స్థాపనకేగాని యున్నత పాఠశాలా నిర్వహణమునకు ప్రభుత్వము వా రంగీకారము

నీయలేదు. అందుచే విరాళములను తిరిగి దాతలకుఁబంతులు గారు పంపివేసిరి. ఇట్లు పాఠశాలాప్రయత్నము నప్పటికి, బంతులుగారు విరమింపవలసివచ్చెను.

ఉపకారవేతనముగ్గైకొని పంతులుగారు చెన్నపురి నుండి రాజమహేంద్రవరము వచ్చినపిదప (1905 లో) ఆస్తిక పాఠశాలా స్థాపనమునకై తిరిగి యత్నించిరి. అప్పుడు శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము పంతులుగారు పట్టణమున నొక మాధ్యమికపాఠశాలను నడపుచుండిరి. ఆపాఠశాలను తమహితకారిణీ సమాజమున కిమ్మని పంతులుగారు కోరఁగా చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు సంతోషముతో నిచ్చివేసిరి. (1907)

ఇఁక దాని నున్నతపాఠశాలగ మార్చుటకు బంతులుగారు మిగుల శ్రమపడవలసి వచ్చెను. అప్పటికి రాజమహేంద్రవరమున క్రైస్తవులచే నిర్వహింపఁబడుచున్న దొకటియు, ప్రభుత్వమునకుఁ జెందిన దొకటియు రెండున్నతపాఠశాల లుండెను. మూఁడవ యున్నతపాఠశాలయొక్క యావశ్యకతను నిరూపింపవలసిన భారము పంతులుగారిపైఁ బడెను. అంతేగాక మఱియొక పాఠశాల వచ్చినచో దమఖ్యాతికి భంగముకల్గునన్న మత్సరముతో నదివఱకున్న పాఠశాలలందలి యుపాధ్యాయులు వ్యతిరేకముగఁ బనిచేయ నారంభించిరి. వీరేశలింగముగారు తమవారి కుద్యోగముల నిచ్చుటకై స్వార్థబుద్ధితో నీప్రయత్నము చేయుచున్నారని కొందఱాలో

పించిరి. అంతటఁ బంతులుగారు పాఠశాలా కార్యనిర్వాహక సంఘము నేర్పఱచి యందు ఆర్ట్సుకాలేజిప్రిన్సిపాలును వర్ధ్యా నిగనుంచి మఱికొందఱు ప్రముఖులను జేర్చుకొనఁగా నున్నత పాఠశాలాస్థాపనకు ప్రభుత్వమువారి యంగీకారము లభించెను.

తర్వాత నీపాఠశాలకు భవననిర్మాణము కొఱకు పంతులుగారు యత్నముచేసిరి. శ్రీపిఠాపురము రాజాగారు ఇరువదివేల నిచ్చుటకు మొదట వాగ్దానము చేసిరి గాని యవసరమునుబట్టి పిదప నలుబది వేలొసంగిరి. పంతులుగారు స్వయముగా దగ్గిరనుండి యీభవననిర్మాణమున శ్రద్ధవహించిరి. అందుచే నాభవనమును జూచిన యొకయింజనీరు దానికి లక్షరూపాయలుపైగా ఖర్చయి యుండునని మదింపుకట్టెను. 1911 వ సంవత్సరమున కలకత్తా సిటీకాలేజీ ప్రిన్సిపాలుగారగు హేరంబ చంద్రమైత్రిగారి యధ్యక్షత నతివైభవముగా నీదివ్యభవనమున గృహప్రవేశోత్సవము జరిగెను.

ఆకాలములో మిగిలిన పాఠశాలలోలేని రెండువిశేషము లీపాఠశాలయందుండెను. ఒకటియేదన పురుషులతో బాటు విద్యాభిలాషగల స్త్రీలనుగూడఁ జేర్చుకొని మెట్రిక్యులేషన్ పరీక్షకుఁ జదివించుట. రెండవది పంచమబాలురను గూడ నాయాతరగతులలో మిగిలినవారితోఁ బాటు చేర్చుకొనుట. విద్యార్థినుల కందఱకు నన్నితరగతులలోను నుచితముగనే విద్యగఱపు నేర్పాటే యున్నతపాఠశాలలోఁ జేయఁబడినది.

మొదట హితకారిణీపాఠశాల యన్న పేరుతో నారంభ మైనను గృహప్రవేశసభలో ప్రభుత్వమువారి యనుమతితో శ్రీ వీరేశలింగము పాఠశాలయను సార్థకనామము దీనికి స్థిర పడినది.

## 9. ప్ర జా హి త సం స్థ లు

ఆంగ్లవిద్య దేశమునం దింకను బాగుగాఁ బ్రబలియుం డనిరోజులలో వీరేశలింగముగా రున్నతపరీక్షలందుఁ గృతార్థు లై యుండిరి. అంతేగాక ఆయుద్యోగశాఖలలో నున్నతపద వులఁ బొందుటకు యోగ్యతగలుగఁజేయు స్పెషల్ టెస్టులలోఁ గూడ ను త్తీర్ణులై రి. ఇట్లు అర్హతవలననేమి, బుద్ధిసూక్ష్మతచేత నేమి, సద్వర్తనమును బట్టియేమి, యధికారుల కుండినసుహృ ద్భావము కారణముగనేమి—ఎట్లు చూచిన నా దినములలో వీరేశలింగముగారేమాత్ర మభిలాష జూపియుండినను బ్రభు త్వోద్యోగములలో రివెన్యూశాఖయందుఁగాని, న్యాయ శాఖయందుఁగాని చాల యున్నతపదవులఁబొంది యెక్కువ ధనలాభము నధికారప్రాప్తియుఁ బొంది యుండెడివారు. స్వప్రయత్నమక్కఱ లేకుండగనే పంతులుగారిని బ్రభుత్వో ద్యోగమున రివెన్యూశాఖలోఁ జేరవలసినదని కొందఱు ఆహ్వా నించి యుండిరి. అప్పటికప్పుడే పంతులుగారు వివేకవర్ధనీ పత్రి

కను నిర్వహించుచుఁ ప్రభుత్వోద్యోగుల లోపములను విమర్శించుచుండిరి. ప్రజాసేవనుండి లౌకికాధికారము వైపు మరల్చి వ్యామోహము గల్గించినచో నట్టి విమర్శలు తగ్గునను నుద్దేశముతోఁ బంతులుగారికి ప్రభుత్వోద్యోగ మెరచూపఁబడి యుండునని యాయన కొక యనుమానము గల్గెను. అప్పటి పరిస్థితులనుబట్టి యిందుఁ గొంతవాస్తవముకూడ నుండియుండును. ఏదియెట్లున్నను ప్రకృతి సిద్ధముగ వీరేశలింగముగారికి ప్రజాసేవయందును, సంఘసంస్కరణము నందు నున్న యభిలాష ధనార్జనమందు నధికారావాప్తియందును లేకుండెను. స్వతంత్రభావమునకును, పారమార్థికచింతకును, మనశ్శాంతికిని రివెన్యూశాఖయం దుద్యోగమున నేమాత్రమును దావులేదని గ్రహించి పంతులుగా రుపాధ్యాయవృత్తి నవలంబించిరి. అందుచే తీరికకాలమునంతను తమకు ప్రీతికరమగు ప్రజాసేవకును ప్రజాహిత సంస్థలు స్థాపించుటకును వారి కవకాశము చేకూరెను.

విద్యార్థిదశయందే వీరేశలింగముగారు దైవభక్తిగలవారై యుండి గోపాలస్వామి యాలయమునకును, మార్కండేయస్వామి యాలయమునకును, నిత్యము బోవుచుండుటయు నొక్కొకపుడు రాత్రిప్రొద్దు పోవువఱకు భజనలలోఁ బాల్గొనుచుండుటయు నుండెను. కాని కాలక్రమమునవారియభిప్రాయములు మాఱి మానసికమగు నీశ్వరోపాసనమే యుత్తమమైనదనినమ్మఁజొచ్చిరి. అంతటఁ బంతులుగారును వారిమిత్రులు

కొందఱును గలిసి మానసికముగ నీశ్వరోపాసనము చేసికొనుట
కొక సమాజమును స్థాపింపఁదలఁచి 1878వ సంవత్సరములోఁ
బంతులుగారియింటనే ప్రార్థన సమాజము నేర్పఱచిరి. పం
తులుగారును మఱియెదుగురు నిం దారంభమున సభ్యులుగ
నుండి ప్రార్థనలు జరపుచుండిరి. ఆసమయములందుఁ బం
తులుగారు చిన్న ధర్మోపదేశములు వ్రాసి చదువుచుండిరి.
కొంతకాలమునకుఁ దర్వాత బాలికా పాఠశాలలో బహిరంగ
ముగనే సభలు జరుపఁబడుచుండఁగనే క్రమశః ప్రార్థనసమా
జమునకు స్వకీయమైన మందిరమే యేర్పడినది. ఈప్రార్థన
సమాజమెన్నియో సత్కార్యములకు నెందఱి వర్తనములనో
చక్కబఱచుటకును కారణభూతమైనది. ప్రార్థనసమయములందు
వందలకొలఁది జనులువచ్చి శ్రద్ధతోఁ బాల్గొనుచుండుటయే
గాక క్రమముగా వికలాంగుల కిచ్చునదే యుత్తమదానమను
ప్రచారమును, బీదలకు రాత్రి పాఠశాలలును వృద్ధి కాఁజొ
చ్చెను. కొంతవఱకుఁ జందాలవలనను కొంత తమస్వంతధన
మును జేర్చియుఁ బదునైదువందల రూపాయల వ్యయముతో
1897 నాఁటికిఁ బ్రార్థనామందిరమును బంతులుగారు పూర్తి
చేయించిరి. ఆసంవత్సరము ఏప్రిల్ 17 వ తేదీని శ్రీ వెంకట
రత్నమునాయుఁడుగా రీభవనమునకు గృహప్రవేశోత్సవము
జరపిరి.

1879 వ సంవత్సరమున వితంతు వివాహవిషయ
మునఁ బంతులుగా రీయఁదలఁచుకొన్న యుపన్యాసములకుఁ

ప్రతిపక్షుల యాటంకములవలన స్థలము దొరకక చిక్కువడ
వలసివచ్చెను. అప్పటినుండియు జనసామాన్యమున కుపయోగ
పడెడి యుపన్యాససభాభవన మొకటి రాజమహేంద్రవర పట్ట
ణమున నుండుటవసరమని నిశ్చయించుకొని తత్సంకల్పసిద్ధికై
పంతులుగారు తగిన సమయమునకు వేచియుండిరి.

1880 వ సంవత్సరము ఆగస్టు 15 వ తేదీని జరిగిన
పురజనుల సభలో పురమందిరము (Town Hall) విద్యా
శాఖ డైరెక్టరుగారగు మక్డానల్డుగారి పేర కట్టుటకు నిశ్చ
యింపబడి వీరేశలింగముగారు చందాలు ప్రోగుచేయుట
కేర్పడిన సంఘమునకు గార్యదర్శిగ నియమింపబడిరి. కాని
తముపై నైదువందల రూపాయలవఱకు కనబడుచున్నను
దగినధనము లభించుజాడ కనబడనందున పురమందిరనిర్మాణ
మప్పటికి సఫలముకాలేదు. అయినను బంతులుగారు శ్రద్ధవిడు
వక పురమధ్యమునమన్న ఆసుపత్రి వీధియందొక స్థలము ను
స్వకీయమగు ధనముతో గొనియుంచిరి. 1897 వ సంవత్స
రమున జరిగిన విక్టోరియా రాణిగారి జూబిలీ యుత్సవసందర్భ
మున దిరిగి సభను సమావేశపఱచి పురమందిరమునకు చం
దాలు వసూలుచేయగా శ్రీ పిఠాపురము రాజుగారు వేయి
~~రూపాయల నిచ్చినారట~~ మఱియైదువందల రూపాయ
లును సమకూడెను. అంతట నప్పుడప్పుడు సంఘసభలు జరు
గుచువచ్చెను. కాని వీరేశలింగముగారు శ్రమపడి చేయుచుం
డినపని కాటంకము చెప్పు సభ్యులెక్కువగ నుండిరి. పంతులు

గారు వ్రాయించిన బిల్డింగు ప్లాను బాగులేదని కొందఱును, పురమందిరము విశాలమగు పార్కులో నుండుట బాగుండును గాన నదివఱలోఁ గొన్న స్థలమనుకూలముగ లేదనువారు కొందఱును అధమము లక్షరూపాయలైనను లేనిదే పురమందిర భవన మేమి బాగుండునని కొందఱును ఇట్లు చెరణయోగ్యముగాని ప్రతిపాదనలఁ జేయసాగిరి.

ఇట్లు రెండు సంవత్సరములు సభలు జరిగిన మీఁదట వృథా కాలహరణము తప్ప పని జరుగుసూచన కనఁబడనందున 1889 సంవత్సరములోఁ బంతులుగారొక నిశ్చయమును చేసికొని బహిరంగ సభయందు పురజనులకును, లేఖలద్వారా సంఘ సభ్యులకును దెలియఁజేసిరి. చందాలమూలమునను, పుర జనుల సహాయముతోను భవననిర్మాణము జరుగుట కవకా శము కనఁబడక పోవుటచేఁ బంతులుగారి గ్రంథముల యమ్మ కమువలనను, వారు పరీక్షాధికారిగా నియమింపఁబడినచో లభించు భృతివలనను వచ్చు ద్రవ్యముతోఁ దామె యన్ని ఖర్చులను భరించి పురమందిర నిర్మాణము చేయుటకు సంక ల్పించుకొనిరి. దైవానుగ్రహమువలన నా సంవత్సరము వారి గ్రంథము లెక్కువ విక్రయింపఁబడి వేయిరూపాయలు లభిం చెను. వారు కోరకయే ప్రభుత్వము వారాయనను మిడిల్ స్కూలు పరీక్షాధికారిగ నియమించిరి. ఇట్లు యూనివర్సిటీ పరీక్షాధికారమువలనఁ గొంతధనము చేకూరెను. తలఁపని తలంపుగ నీశ్వరసహాయ్యముచే నెక్కువ ద్రవ్యము లభించు

టచే మొదట మూఁడువేలతోఁ బూర్తి చేయఁదలచినను తర్వాతఁ బెంచి యేడువేలరూపాయల వ్యయముతోఁ బుర మందిరభవన నిర్మాణమును బూర్తిచేసి 1890 వ సంవత్సర మున గృహప్రవేశోత్సవము జరపనెంచిరి. 1897 వ సంవత్స రమునఁ బంతులుగారొక నిక్షేపపత్రము (Trust Deed) వ్రాసి పదముగ్గురు ట్రస్టీల యధీనమున నాభవనముంచివేసిరి. జాతిమతభేదములులేక సర్వజనులకు నుపయోగించునట్లును, ఆభవనము నీతిప్రవర్తకమగు మార్గములకే వినియోగింపఁబడు నట్లును, దాతయొక్క యుద్దేశముల కెన్నటికిని భంగము కలుగకుండునట్లును ట్రస్టుడీడులో పంతులుగారు కట్టుదిట్టముల నేర్పఱచిరి.

పురమందిర నిర్మాణము జరిగిన వెంటనే పంతులు గారు చెన్నపురికి వెళ్ళిరి. ఆనగరము చేరినకొలఁది కాలము లోనే సంఘసంస్కరణ సభాసమావేశము జరిగినపుడు క్రియ లేని శుష్కవచనములతోఁ బనిలేదని పంతులుగారు చెప్పఁగా సభ్యులందఱును వితంతు శరణాలయమునొకటి స్థాపింప నిశ్చ యించిరి. అందులకొక గృహమవసరము గనుకఁ జందాల మూలమున ద్రవ్యము సమకూర్చుటకు సంస్కరణ సమా జమువారు తీర్మానించిరి. ధనము సమకూడువఱకును ముందుఁ బెట్టుబడి పెట్టుటకు సభలో నొకరు వాగ్దానముచేసిరి. కాని క్రియాభాగమునకు వచ్చునరికి కిందొకటియు నెఱవేఱలేదు. అందుచేఁ బంతులుగారి కార్యమునకు స్వయముగాఁ బూను

కొని మూఁడువేల యెనిమిదివందల రూపాయలకొక యిల్లు క్రయమునకు మాట్లాడి తత్క్షణమే తమవద్దనుండిన యైదువందల రూపాయలు చెల్లించి తరువాత మూఁడునెలలలో మిత్రులసహాయముచే మిగిలినధనము ఋణముచేసి వితంతు శరణాలయగృహమును కొనిరి. ఋణమును క్రమముగాఁ దీర్చిరి. మొదటఋణముగా వేయిరూపాయలిచ్చిన శ్రీ పోలవరము జమీందారుగారి కాగితమును పంతులుగారు ఋణ విమోచనమునకై పంపఁగా నాయుదారహృదయులు విరాళముగా నామొత్తము తిరిగి యిచ్చివేసిరి.

పంతులుగారు మదరాసులో నుండినపుడు సంఘ సంస్కరణ సమాజమునకుఁ బండ్రెండు వందల రూపాయలు వ్యయపఱచి యొకయింటిని కట్టించి యిచ్చిరి. ఆనగరమున బ్రహ్మసమాజమునకుఁ బంతులుగా రధ్యక్షులుగానెన్నుకొనఁబడి సమాజపుఖర్చులకు నిధిని సమకూర్చుటలో శ్రద్ధ వహించిరి. తర్వాత వితంతువులకుఁ బాఠశాల నడపుటకై కీల్పాకమునందు సుమారు వెయ్యిరూపాయల వ్యయముతో స్థలముకొని యిల్లుగూడఁ గట్టించిరి. వితంతువులనుపాఠశాలకుఁ బంపి విద్య చెప్పించుటకును, అన్నవస్త్రాదులను పుస్తకముల నిచ్చుటకును, అవసరమైనపుడు వైద్యము చేయించుటకును పంతులుగారు విశేషశ్రమ నొందుచుండిరి. ఆయన కిట్టి పనులలో వాక్సహాయమేగాని క్రియారూపమున సాయములభించుటరుదుగ నుండెను. 1907 సంవత్సరములోఁ బంతులుగారు

బెంగుళూరు వెళ్ళి నపుడచటఁ బదిహేనువందల రూపాయల ఖర్చుతో నొక ప్రార్థనామందిరము నిర్మించిరి.

మదరాసు విడిచి రాజమహేంద్రవరము వచ్చిన పిదప 'అగ్బతునాటు' కంపెనీలో తాము దాఁచుకొన్న ధనముతో సుమారు రెండువేల రూపాయలు విలువగల తోఁటసుకొని యందు వితంతుశరణాలయము స్థాపించి తత్సంబంధమున నొక బాలికా పాఠశాలను బంతులుగారు నడుప నారఁభించిరి. కొలఁది కాలముననే శ్రీ ములుకుట్ల అచ్యుతరామయ్యగారు పంతులుగారి దర్శనార్థమై యచటకు వచ్చి వితంతు శరణాలయము, అనాధశరణాలయము, పతితవనితా రక్షణాలయము మొదలగు వానిని పంతులుగారు నిర్మింప నుద్దేశించిరట్లు తెలిసి కొని (అచ్యుతరామయ్యగారు) ఈభవనములన్నియుఁ దమ ఖర్చుతోఁ గట్టించి యిచ్చిరి. వీటిఖరీదు సుమారయిదువేల రూపాయలయి యుండును.

పై సంస్థకు శ్రీ రాజమహేంద్రవరపుర విక్టోరియా హిందూవితంతు శరణాలయమని నామకరణముచేసి యందుఁ జేరువారు నడచుకొనవలసిన విధులు కట్టుదిట్టముగ నేర్పఱచి శ్రీ అచ్యుతరామయ్యగారు కట్టించి యిచ్చిన భవనమున 1908 సంవత్సరములో గృహప్రవేశమును పంతులుగారతివై భవముగ జరపిరి.

ఈప్రకరణమున నుదహరింపఁబడిన ప్రజాహితసంస్థ లన్నియు నట్లుండ బంతులుగారు స్థాపించిన సంస్థలన్నిటి

యందు నగ్రస్థానము వహించునదియు శాశ్వతకీర్తిదాయకము నునైనది హితకారిణీసమాజము. ఈ సంస్థనుగూర్చి ముందు ప్రకరణమునఁ జదివెదము.

## 10. హి త కా రి ణీ స మా జ ము

పంతులుగారు తమజీవితమున నుద్దేశించిన ముఖ్యప్రజాహితసంస్థలు స్థిరముగ నెలవేఁటుటకై హితకారిణీ సమాజమనుపేర నొక సంఘమును 1906 వ సంవత్సరము డిసెంబరు నెల 15 వ తేదీని మిత్రుల సాహాయ్యముతో స్థాపించిరి. మొట్టమొదట నందలి సభ్యులుముప్పదియాఱుగురు. వితంతుశరణాలయములు, అగతికశిశుసంరక్షణశాలలు, పాఠశాలలు, శిల్పశాలలు మొదలగు సంస్థలను సక్రమముగ నెలవేర్పుటయీ సంఘముఖ్యోద్దేశము. ఈసంఘమును రిజిష్టరు చేయించి సభ్యులలోఁ దొమ్మండుగురను కార్యనిర్వాహకులుగఁ బంతులుగారేర్పఱచి సమాజమునకు వితంతుశరణాలయము, బాలికాపాఠశాల, ఒకఇంగ్లీషు తెలుఁగు వారపత్రిక—వీని నొప్పగించిరి. ఈసమాజకార్యములవిచ్ఛిన్నముగా జరుగుటకై యప్పటికిఁ దమకున్న యాస్తినంతను బంతులుగారు సమాజమున కిచ్చివేసిరి. ఆసొత్తు మొత్తపు విలువ సుమారు 41500 రూపాయలు.

సొత్తువివరములు క్రింది విధమున నున్నవి:—

1. రు 6500 విలువగల పంతులుగారి పూర్వగృహము (రాజమహేంద్రవరము.)
2. రు 2000 వెలగల లక్ష్మీవారపుపేటలోని యిల్లు. ,,
3. రు 1500 వెలగల ప్రార్థనమందిరము. ,,
4. రు 6000 చేయుతోట, రెండిండ్లు. ,,
5. రు 6000 వెలగల మరియొకతోట, అందులో ములుకట్ల అచ్యుతరామయ్యగారు కట్టించినయిండ్లు.
6. రు 1000 వెలగల పుస్తకభాండాగారము.
7. రు 10000 వెలగల పంతులుగారు రచించిన గ్రంథ సంపుటముల ముద్రణమందలి హక్కు.
8. రు 2000 వెలగల భీమాపత్రము.
9. రు 2000 ఒకరికి బదులిచ్చిన సొమ్ము.
10. రు 3500 లు రొక్కము.

ఇట్లు పంతులుగా రప్పటికిఁ దమకుఁగల యాస్తిని యేదియు స్వీయమున కుంచుకొనలేదు. చెన్నపట్టణమందలి యిండ్లుగూడ నమ్మివేసి రొక్కముగ నిచ్చివేసిరి. తమ జీవితకాలములోఁ దమగ్రంథ విక్రయమువలన వచ్చురాఁబడిని మాత్రము తమ జీవితాంతము వఱకు సొంతమున కుంచుకొనిరి.

## 11. బ్రహ్మసమాజ మతావలంబనము

పాశ్చాత్యదేశములతోఁ గలిగిన సంపర్కమువలన నేమి, కాలపరిణామ ఫలితముగనేమి—పందొమ్మిదవ శతాబ్దారంభమున మనదేశపు సాంఘికచరిత్రయందు నూతనాధ్యాయము మొదలిడినదని చెప్పవచ్చును. విగ్రహారాధనము, వర్ణభేదములు, వివాహవిషయమున స్త్రీ పురుషులం దేర్పడియున్న వ్యత్యాసములు—ఇవి మొదలగుగాఁగల హిందూసాంఘికాచారములందు ప్రజల కదివఱకుండిన దృఢవిశ్వాసములు చలింపసాగెను. ఇట్టి సంచలనమునకుఁ బ్రధానకారణము శ్రీ రాజా రామమోహనరాయల యుపదేశసారమే యైయుండెను. రామమోహనుఁడు స్థాపించిన బ్రహ్మసమాజసంస్థ బంగాళమునుండి భారతదేశమునందు నల్దెసలకును తన ప్రబోధముల నుచ్చైస్స్వనముతో నుద్ఘోషింపసాగెను. శ్రీ రామమోహనరాయలు తనజీవితమును (1774-1833) ధన్యమైనదిగఁ జేసికొని భారతదేశమునందు నూతనోత్తేజమునకును, నూతనభావ పరిణామమునకును, నూతనవిజ్ఞాన వికాసమునకును గారణభూతుఁడయ్యెను.

మన కథానాయకులగు వీరేశలింగము పంతులుగారు బాల్యమునుండియు దైవచింత గల్గియుండిరనియు, అప్పటి కాల పరిస్థితినిబట్టియు, నాచారములనుబట్టియు దేవాలయ

ములకు శ్రద్ధగాఁబోయి విగ్రహారాధనమునఁ బాల్గొనుచుండి
రనియు మనము తెలిసికొని యుంటిమి.

కాని 1868 సంవత్సరము నాఁటికి అనగాఁ బంతులు
గారికి సుమారు పదిరెండు సంవత్సరముల వయస్సు వచ్చు
సరికి వారి పూర్వవిశ్వాసములు మాఱఁజొచ్చెను. మిత్రు
లొకరియొద్ద కేశవచంద్రసేనుల యుపన్యాసములఁ జదువుట
చేతను, బందరునుండి ఉపాధ్యాయులుగ రాజమహేంద్రవర
మువచ్చిన ఆత్మూరి లక్ష్మీనరసింహముగారి ప్రోత్సాహము
వలనను పంతులుగారికి బ్రహ్మసమాజ సిద్ధాంతములం దాద
రము కలుగసాగెను. భూతావేశము, శకునములు, ముహూర్త
ములు, జాతకములు ఇట్టివానియందు వారినమ్మకముపూర్తిగా
చెడెను. నమ్మకములేని యంశములను బామరుల సంతుష్టికై
నమ్మినట్లు నటించి యాచరించుట పంతులుగారి స్వభావము
నకు సరిపడదు. విశ్వసింపని విషయములను దాము విశ్వసింప
మని స్పష్టముగఁ జెప్పివేయుటయు, అవిశ్వాసరాహిత్యమును
మాటలచేతనేగాక చేష్టలయందును జూపుటయుఁ బంతులు
గారి నైజము. తులసీరుద్రాక్షమాలాది బాహ్యచిహ్నధార
ణముకంటె సత్ప్రవర్తనము మతమున కధికావశ్యకమని విశ్వా
సముకలవారై యట్టి భావములు ప్రజలలో వ్యాపింపఁజేయు
నుద్దేశముతోఁ బంతులుగారు వివేకవర్ధనీపత్రిక నారంభించిరి.
ఆస్తిక్యము, వివేకము, సత్యము, అహింస మొదలగు ఉప
న్యాసము లాపత్రికయందుఁ బ్రకటింపఁబడు చుండెను.

అప్పటికే పంతులుగారు బహుదేవతారాధనము మాని యేకేశ్వరోపాసనమును బూనియుండిరి. వివేకవర్ధని మొదటి సంచికలోని యీక్రిందిపద్యము వారి పరిశుద్ధాస్తికభావమును తేటపరచుచున్నది.

సీ. అక్ష్యాదిబాహ్యేంద్రియాగోచరుండయి
యాత్మస్వరూపుఁడై యలరువాఁడు
సచరాచరంబైన సర్వసృష్టికినాది
కారణుండయి చాలఁగ్రాలువాఁడు
దుష్టశిక్షణమును శిష్టరక్షణమును
నాత్మకృత్యములుగ నమరువాఁడు
సర్వజ్ఞుఁడయియుండి జనులెందుఁ గావించు
సుకృత దుష్కృతముల జూచువాఁడు

నిత్యుఁడీశ్వరుఁ డభవుండు నిర్మలుండు
నాదుపత్రికా రత్నంబు నాదరమునఁ
బ్రబలఁగాఁజేసి యెల్లెడవాసి కెక్క
నించుకంతదయ నను గ్రహించుఁగాత!

పంతులుగారు ధవళేశ్వరములో నున్నంతకాలమును ప్రతి యాదివారమును సభల సమకూర్చి మతవిషయములు, నీతివిషయములు మొదలగు వానినిగూర్చి యుపన్యసించుచుండిరి. తర్వాత క్రమముగాఁ బంతులుగారు పూర్వాచార

ములఁ బూర్వపక్షముచేయుచు దేశాభివృద్ధి కరములైన నూతనాచారముల సిద్ధాంతముచేయుచు వివేకవర్ధనీ హాస్యసంజీవిను లలో ననేకవ్యాసములు వ్రాసిరి.

1878 వ సంవత్సరము సెప్టెంబరు నెలలోఁ బంతులుగారు రాజమహేంద్రవరమున సంఘసంస్కార సమాజమును స్థాపించి ప్రబోధకరములగు నుపన్యాసము లిచ్చుచుండుటయే గాక యీసంవత్సరముననే మానసికముగ నీశ్వరోపాసన జరపుట కనువగునట్లు ప్రార్థనసమాజమును స్థాపించిరి. ఇట్లాక దానితర్వాత నొకటిగఁ దాము యథార్థమని నమ్మినవియు, నీశ్వరప్రీతికరములని విశ్వసించినవియు నగు బ్రహ్మమత సిద్ధాంతముల నాచరించుట కుపక్రమించిరి.

సంస్కారకరణమునం దత్యంతాభినివేశముగల కొలఁది మంది మిత్రుల సాహాయ్యముతోఁ బంతులుగారు బాల్యవివాహముల వలని యనర్థములు, కన్యాశుల్కము గొనుటయందలి యవివేకము, రజస్వలా వివాహములఁజేయుటచే నేర్పడు ప్రయోజనములు, స్త్రీవిద్యాభివృద్ధి—మొదలగు నంశముల గూర్చి ప్రచారముచేయఁ దొడంగిరి. కాని కార్యరూపము దాల్పనిశుష్కోపన్యాసము లెక్కువ లాభకారకములు కాఁ జాలవని గ్రహించి సంఘసంస్కరణమును కార్యాచరణలోనికిఁ దెచ్చుటకుఁ దగినయదను జూచుచుండిరి. శాఖాంతర వివాహములు చేయుటకుఁ బంతులుగారు ప్రోత్సహించిరి గాని

మొదటనట్లు చేయుటకు వాగ్దానముచేసిన వారు చివరకేదో నెవముఁజెప్పి తప్పించుకొనఁ జొచ్చిరి.

ఇట్టిస్థితిలో బ్రహ్మసమాజ సిద్ధాంతములలో నతి ప్రధానమైనదగు వితంతూద్వాహోద్యమమును 1881 లో నారంభించి యనేకకష్టములకు లోనై జయప్రదముగ నడపి తమజీవితమునందు ముప్పదిమైదు స్త్రీపునర్వివాహములను బంతులుగారు జరపియుండిన విషయమిదివఱలోఁ జదివి యున్నాము.

సంఘసంస్కరణ సమాజకార్యములందును, బ్రహ్మ సమాజధర్మ వ్యాపనమునందును బంతులుగారికి విశేషాభి మానముండెను. కాని వారికి క్రియాశూరతయేగాని, క్రియా శూన్యమైన వాక్శూరతయన్న రోత. ఇందుల కొక దృష్టాం తము పంతులుగారు చెన్నపురి పోయినపుడు వార్తా పత్రిక లలో సంఘసంస్కరణ సమాజము వారేర్పఱచిన సంస్కార భోజనములనుగూర్చి తాామునందుఁ బాల్గొనుటకై పురమంది రమునకుఁ బోయిరి. అచట బ్రాహ్మణులును, బ్రాహ్మణేత రులునుకలిసి యేడెనిమండ్రుగురుభోజనముచేయనారంభించిరి. భోజనసమయములోఁ బంతులుగారొక ప్రశ్నవేసిరి. ఈసహ పంక్తి భోజనముచేయువారి పేర్లు పత్రికలలోఁ బ్రకటింపఁ బడునా? యని వా రడిగిరి. అట్లు ప్రకటించినచో సంస్కరణ భోజనములే జరుగవని సమాధానమురాగా నిట్టి కార్యభీరు

త్వముపలనఁ బ్రయోజనమేమియని వారిని మందలించి పంతులుగారు తిరిగి యట్టిచర్యలలోఁ బాల్గొనలేదు.

ఇట్లు పంతులుగారు బ్రహ్మసమాజవ్యాపనమునకై చేసిన కృషిఫలితముగ దక్షిణహిందూదేశ బ్రహ్మసమాజమునకుఁ బ్రధానాధ్యక్షులుగ నెన్నుకొనఁబడిరి.

చెన్నపురినుండి రాజమహేంద్రవరము వచ్చిన పిదపఁ బంతులుగారు బ్రహ్మసమాజములో ననుష్ఠానపరులు కావలెనన్న కుతూహల మెక్కువయయ్యెను. బ్రహ్మసమాజమునం దప్పటికి రెండుశాఖ లేర్పడెను. ఒకటి యాదిబ్రహ్మసమాజము, రెండవది యనుష్ఠానబ్రహ్మసమాజము (సాధారణ బ్రహ్మసమాజము) యజ్ఞోపవీతము విసర్జించి వర్ణభేదము విడిచి శూద్రాదులతోనేగాక క్రైస్తవ మహమ్మదీయాదులతోఁ గలిసి భోజన ప్రతిభోజనముల నాచరించు శాఖ యనుష్ఠానశాఖయని పేరుపొందెను. 1905 వ సంవత్సరమున బ్రహ్మమత ప్రచారకులగు బాబు హేమచంద్ర సర్కారుగారు రాజమహేంద్రవరమునకుఁ గాఁ బంతులుగా రాయనతో మాట్లాడి తామనుష్ఠానపరులుకా నుద్దేశించినట్లు చెప్పి 1906 వ సంవత్సరము ఫిబ్రవరినెలలో వారి తండ్రిగారి శ్రాద్ధమును బ్రాహ్మధర్మపద్ధతిని జరపి నాఁడు మొదలు వర్ణభేదము త్యజించి సార్వజనసౌభ్రాత్రము వహించి క్రైస్తవులు లోనగు సర్వమతముల వారిని విందునకుఁ బిలిచి వారితోఁ గలిసి భోజనముచేసిరి. పిదప యజ్ఞోపవీతమునుగూడఁ బరిత్యజించిరి.

పంతులుగారి యాదర్శము ననుసరించి గొందఱు యువకులు క్రమముగా ననుష్ఠానపరులైరి. ఇట్లాంధ్రదేశమునఁ బరిశుద్ధాస్తిక సిద్ధాంతప్రచారమే పరమావధిగాఁగల బ్రహ్మసమాజమతము వృద్ధిపొందుటకు శ్రీ వీరేశలింగము పంతులుగారు పునాదివేసిరి. వారు స్థాపించిన వివిధసంస్థలలో నీసిద్ధాంత ప్రచారమునకుఁ గట్టుదిట్టము లేర్పఱచుటచే నీయుద్యమము దినదినాభివృద్ధి గాంచుచున్నది.

## 12. పంతులుగారికిఁ గల్గిన గౌరవములు

శ్రీ వీరేశలింగము పంతులుగారు తమ జీవితము నొకే సమయమున ననేకమగు కార్యరంగముల కర్పించిన సర్వతోముఖ ప్రతిభాశాలియగుటచే నాయనను ప్రభుత్వము వారు, విద్యాశాఖాధికారులు, పౌరులు, సంస్కరణవాదులు, బ్రహ్మసమాజికులు వీరువారననేల? పంతులుగారితోఁగించిత్తు సంబంధ మేర్పడిన వారందఱు ననేకవిధముల గౌరవించిరి. ఇట్లనుటకంటెఁ బంతులుగారిని గౌరవించుటచేఁ దమ్ముఁదామే యప్పటికాలపు వారు గౌరవించుకొనుట సత్యమున కింకను జేరువగనుండును.

పంతులుగారి ఘనతను గుర్తించి 1893 వ సంవత్సరారంభమునఁ బ్రకటింపఁబడిన నూతనసంవత్సర బిరుదములలో రావుబహాదూర్ అను బిరుదును ప్రభుత్వము వారొసంగిరి.

తోడనే పంతులుగారి నెఱిఁగినవారు నెఱుఁగనివారు నెందఱో యాయన కభినందనలేఖలు వ్రాసిరి. అంతేగాక యాబిరుదు నకుఁ బంతులుగారి యర్హతనుగూర్చి వేర్వేఱు పత్రికలు వేనోళ్ల నుగ్గడించుచు వ్యాసముల వ్రాసెను. రాజమహేంద్ర వరపు వాస్తవ్యులు బహిరంగసభలో నభినందించిన మీఁదట విద్యాశాఖ డైరెక్టరుగారగు డంకన్‌గారు బహిరంగసభలో సనదును పంతులుగారికి దయచేసిరి.

1897 వ సంవత్సరమునఁ బంతులుగారు రాజమహేంద్రవరము వదలి మదరాసు పోవునపుడు పురవాసులు బ్రహ్మాండమగు సభ జరపి వీడ్కోలొసంగిరి. పంతులుగారి సేవను శ్లాఘించుచుఁ బద్యములువ్రాసి, విందులు చేసి, ఛాయాప్రతిమలు (Photographs) తీయించి పౌరులు మిగుల గౌరవించి పంతులుగారు తమ్ము వదలిపోవుచున్నందులకు విషాదము వెలిపుచ్చిరి. కాకినాడలోఁగూడ నిట్టి వీడ్కోలుసభ జరిగెను.

1898 లో ప్రభుత్వమువారు పంతులుగారిని Fellow of the Madras University మద్రాసు విశ్వకళాపరిషత్సభ్యులు) గా నియమించిరి.

1897 లో ఏలూరున జరిగిన గోదావరిమండల సాంఘిక సభకుఁ బంతులుగా రగ్రాసనాధిపతిగ నెన్నుకొనఁబడిరి.

1881, 1890 సంవత్సరముల మధ్యఁ బంతులుగారు మ్యునిసిపల్ కౌన్సిల్, తాలూకాబోర్డు, డిస్ట్రిక్టుబోర్డులలో సభ్యులుగా నియమింపఁబడి యందు శ్రద్ధతోఁ బనిచేసిరి.

1887 వ సంవత్సరమునుండి యవిచ్ఛిన్నముగా నిరువదియెదేండ్లు యూనివర్సిటీపరీక్షలకుఁ బరీక్షాధికారిగాఁ బంతులుగారు నియమింపఁబడిరి. దీనివలన వారికి దాదా పిరువది వేలరూపాయలు లభించినవి; కాని యీమొత్త మంతయు వారుపకారార్థముగ నేయు పయోగించిరి. గవర్నమెంటువారుపంతులుగారిని మిడిల్‌స్కూలు పరీక్షాధికారిగఁగూడఁ గొన్నిసంవత్సరములు నియమించిరి. వీరేశలింగముగారు రచించిన గ్రంథములెన్నియో ప్రభుత్వపరీక్షలకును, విశ్వకళాపరిషత్పరీక్షలకును బఠనీయగ్రంథములుగ నేర్పఱుప బడినవి.

పంతులుగారు చెన్నపట్టణములోనున్న కాలమునసంఘసంస్కరణ సమాజమునకును, దక్షిణహిందూస్థాన బ్రహ్మసమాజమునకును నధ్యక్షులుగ నెన్నుకొనఁబడిరి.

అప్పుడే చెన్నపురి పాఠశాలా పుస్తకదేశభాషా సంఘమువారు తమకార్య నిర్వాహకసంఘములో వీరేశలింగముగారిని సభ్యులుగఁ జేర్చుకొనిరి. పఠనీయగ్రంథసంఘములో (Text book Committee) ప్రభుత్వమువారు పంతులుగారిని సభ్యులుగ నియమించిరి. యూనివర్సిటీవారు ద్రవిడభాషాధ్యయనసభలో నాయనను సభ్యులుగ నియమించిరి. సబ్‌కలెక్టరు మొదలగువారికి జరగు భాషాపరీక్షకపరీక్షలలో (Language Tests) గూడ బంతులుగారిని ప్రభుత్వమువారు నియమించిరి.

1898 సంవత్సరమునఁ జెన్నపట్టణమున జరిగిన హైందవదేశీయసాంఘికమహాసభకుఁ బంతులుగారగ్రాసనాసీనులుగ

నెన్నుకొనఁబడిరి. ఆగొప్పసభలో శ్రీ మహాదేవ గోవింద రేనడేగారు వీరేశలింగము పంతులుగారికి 'దక్షిణదేశవిద్యాసాగరుఁడు' అని బిరుదు నొసఁగిరి.

1902 లో కాకినాడలో జరిగిన చెన్నరాజధాని దేశీయ సాంఘిక మహాసభకును, 1903 లో బెజవాడయందు జరిగిన కృష్ణామండల సభకును, 1903 లో మదరాసులో జరిగిన హిందూ దేశీయాస్తిక సభకును పంతులుగా రధ్యక్షత వహించిరి.

బందరు, గుంటూరు, బెంగుళూరు మొదలగు స్థలములకుఁ బంతులుగారు వెళ్ళినపు డచట సభినందనపత్రముల సమర్పించి యాయన యొనర్చిన సంఘసేవను పౌరులందరెంతయుఁ గొనియాడిరి.

1908 వ సంవత్సరము ఏప్రిల్ 14 వ తేదీకి శ్రీవీరేశలింగము పంతులుగారి కరువది యేండ్లు నిండుటచే షష్టిపూర్త్యుత్సవమత్యంత వైభవముతో జరుపఁబడెను. మిత్రులనేకులు దూరదేశములనుండి వచ్చి పాల్గొనిరి. కొందఱుజాబుల మూలమునను దంత్రీవార్తల మూలమునను నభినందనములఁ బంపిరి. ప్రశంసాపద్యములు చదువఁబడెను. కొందఱు బహుమానముల సమర్పించిరి. పంతులుగారి విస్తృతఛాయాపటము (Enlarged Photograph) వారికిఁ గానుకగ నొసఁగఁబడెను.

## 13. సమకాలికులు

వీరేశలింగము పంతులుగారనేకసంస్థలతోను, ఉద్యమములతోను సంబంధము గల్గియుండిన వారగుటచే నెందరి వ్యక్తులతోడనో ఆయనకు మైత్రిగాని యొక్కొక్కపుడు ప్రతిపక్షతగాని యేర్పడుట తటస్థించుచుండెను. పంతులుగారి సమకాలికులను గూర్చి కొంచెము తెలిసికొనుట ప్రయోజనకారిగ నుండఁగలదు. సుప్రసిద్ధాంధ్రపండితులగు శ్రీకొక్కొండ వెంకటరత్నము పంతులుగారికిని వీరేశలింగము పంతులుగారికిని 1874 సంవత్సరప్రాంతమున స్త్రీవిద్య విషయమై పత్రికలలందు వాదోపవాదములు జరిగెను. వెంకటరత్నము పంతులుగారు కొంతకఠినమగు వాక్ప్రయోగముచేసి మోటుగ బండదెబ్బ కొట్టఁగా వీరేశలింగము పంతులుగారు మృదుపదప్రయోగముచే లోఁతుగాదూరి మనస్సునకు నొప్పి కల్గించునట్లు వ్రాయుచుండిరి. వెంకటరత్నముగారు కుకృతివిమర్శనీ సమాజమను పేరుతో వీరేశలింగముగారి గ్రంథములందలి దోషములఁ జూపుచుండఁగా గుణాగుణప్రదర్శనీ సమాజమను పేరుతో వీరేశలింగము పంతులుగారు వెంకటరత్నముగారి గ్రంథదోషములఁ జూపుచుండిరి.

చల్లపల్లి బాపయ్యపంతులుగారు వీరేశలింగముగారికి బాల్యసఖులు; సహపాఠి; సహోపాధ్యాయుఁడు. వీరేశలింగముగారు ధవళేశ్వరములో నున్నపుడు బాపయ్యగారు

తలచుచుగ వారియొద్దకుఁ బోవుచు వివేకవర్ధనీ పత్రికానిర్వహ ణమున నెక్కువగఁ దోడ్పడుచుండిరి. వితంతు వివాహోద్య మమువంటి గొప్పయుద్యమము నారంభించుటకు వీరేశలిం గము పంతులుగారు సందేహించుచున్న సమయమున వీరేశ లింగముగారిని బ్రోత్సహించి యెన్నికష్టములు వచ్చినను, అన్నదమ్ములు విడచినను చలింపక వీరేశలింగముగారికా యుద్యమమునఁదోడుగా నుండెదనని వాగ్దానముచేసి వీరేశలిం గముగారిచే స్త్రీపునర్వివాహోద్యమమును బాపయ్యపంతులు గారే యుపక్రమింపఁజేసిరి. అన్నదమ్ములు తన్నుగదిలో నుంచి తాళము వేయుటచేసియన ప్రథమ వితంతూద్వాహము నకు వెళ్ళఁజాలక పోయినను 1905 సంవత్సరములో వీరేశ లింగము పంతులుగారి కంటెను ముందుగా బాపయ్యగారు యజ్ఞోపవీతాదుల విసర్జించి యనుష్ఠానబ్రాహ్మమతావలం బులై పితృశ్రాద్ధమును బ్రాహ్మమత సిద్ధాంతాను సారముగ జరపిరి. 1906 వ సంవత్సరమున బాపయ్యగారి యింట బ్రాహ్మణులు, వైశ్యులు, శూద్రులు, క్రైస్తవులును కలిసి పాల్గొన్న సంస్కారభోజనము జరిగెను.

బసవరాజు గవర్రాజుగారు వీరేశలింగము పంతులు గారి సహోపాధ్యాయులుగ గొంతకాలముండి వారితోనత్యంత మైత్రిగలవారై ప్రజాహితకార్యములం దాయనతో నెక్కు వగఁ గలిసి మెలసి పనిచేయుచు బంతులుగారికి బ్రాణమిత్రు లుగ నుండిరి. దురాచారనిర్మూలన యత్నమునం దెక్కువగ

గవర్రాజుగారు పంతులుగారికిఁ దోడ్పడుచు వివేకవర్ధనీ పత్రి
కలో నింగ్లీషుభాగమును వ్రాయుచుండిరి. గవర్రాజుగారు
చిత్రపు కామరాజుగారి తోడల్లుడు. కామరాజుగారు మున
నబుగారి పక్షమున వ్రాయుచుండిన చిత్తు తీర్పులకు పయర్థాై
జరిగిన గ్రంథమును గూర్చి యిదివఱలో జదివియుంటిమి.
గవర్రాజుగారు వీరేశలింగముగారి ప్రాణమిత్రులైన నీవిషయ
మున మాత్రము పంతులుగారు గవర్రాజుగారికిఁ బనిపెట్టలేదు.
అయినను న్యాయైకపక్షపాతముచే గవర్రాజుగారు పంతులు
గారి కీవిషయమునఁ దోడునీడయై నిలిచిరి. ప్రజాక్షేమము
విషయమై పనిచేయవలసి వచ్చినపుడీ మిత్రులు స్వజాతివాఁ
డనికాని, బంధువనికాని చూడలేదు. వితంతువివాహోద్యమ
మందు వీరేశలింగము పంతులుగారి పరమమిత్రులలోఁ గొం
దఱు వారిని విడువవలసిన యగత్యము కల్గెను. కాని గవ
ర్రాజుగారు మాత్రము చివరివఱకు ధైర్యముతో నిలచిరి.
1885 లో చెన్నపురిలోఁ బంతులుగారు స్త్రీపునర్వివాహ
చరిత్రను గూర్చి యుపన్యసించినపుడు గవర్రాజుగారిని గూర్చి
యిట్లు చెప్పిరి. నాకు మొదటినుండియుఁ బరమాప్తుడై, ఒక్క
యీకార్యమునందేగాక దేశక్షేమము నిమిత్తమై నేనీ దఱి
పెట్టిన మంచికార్యములలో నెల్ల నాకుఁ గుడిభుజమయి
యుండి, పైకి పేరు వ్యక్తమైనను చాటున నాకంటెను బహు
గుణము లధికముగా బనిచేయుచు వచ్చుచున్న బసవరాజు
గవర్రాజుగారి సాహసచరిత్రము నిచట ముఖ్యముగ శ్లాఘింప

వలసియున్నది. పదిమంది యొక్కసారిగా లోకాంతరగతు లయినపుడు పుట్టునంత సంక్షోభము మావివాహదినమున వారింటపుట్టినది. భార్యవంకవారును దనవంకవారు నొక్కసారిగా గొల్లుగోలుపెట్టి మధ్యాహ్నసమయమున మృతుని నిమిత్త మేడ్చునట్లేడ్చుచు శపించుచు లేచిపోయిరి. తన్ను పెంచి పెద్దవానిని జేసిన పెదతల్లి విడిచి పోయినను వెనుదీయక లోకోపకారము నిమిత్తమె యెన్నికష్టములు వచ్చినను సహించియుండి, భార్యదీర్ఘవ్యాధిచేత బహుమాసములు మంచ మెక్కియుండినను బంధువులురాక బహుబాధలు తటస్థించినను ప్రాయశ్చిత్తమన్న పేరునైనం దలపెట్టక యీ దినమువఱకును బరోపకారమయిన యీకార్యము నిమిత్తము వ్యయప్రయాసములను సంతోషపూర్వకముగా వహించుచున్న యీనామిత్రు నెట్లు శ్లాఘింపవలెనో యెఱుంగలేకున్నాను. 1888 వ సంవత్సరమున నిట్టి మిత్రరత్నమును బంతులుగారు గోల్పోయిరి.

ఆంధ్రదేశమునకు 'Grand old man' ప్రపితామహుడు, అని పేరొందు వివిధోద్యములలో బాల్గొనిన శ్రీన్యాపతి సుబ్బారావు పంతులుగారు వీరేశలింగముపంతులుగారి సమకాలికులు; ముఖ్యమిత్రులు వీరేశలింగముగారు చేయుచుండిన ధర్మకార్యములలో నెల్లవారి కవసరమైనపు డంతయును వడ్డీలేక వారికి ఋణములిచ్చి యనేకసంస్థల నిర్మాణములో వారికిం దోడ్పడిరి. వీరేశలింగము పంతులు

గారితోఁ గలిసి మెలసి పనిచేయుచు స్త్రీ సికపాఠశాలను నిర్వ
హించుటయందు భేదాభిప్రాయమును బొందిన యేలూరి
లక్ష్మీనరసింహముగారు కొన్ని కారణములచే ద్వేషముబూని
పంతులుగారు మహారణ్యపురాధిపత్యమని వ్రాసిన ప్రహస
నము తన్నుద్దేశింపఁబడి వ్రాసినదనియు నందులకుఁ దత్కర్త
యగు వీరేశలింగముగారిని శిక్షింపవలెననియు నభియోగము
తెచ్చిరి. ఈవ్యవహారమున న్యాపతి సుబ్బారావుపంతులుగారు
వీరేశలింగముగారి పక్షమున నిద్రాహారములుమాని శ్రమపడి
న్యాయవాదిగ వాదించి వీరేశలింగముగారిని దప్పించిరి. కేవ
లము మిత్రకార్య తత్పరతచేతనే సుబ్బారావు పంతులుగారు
పనిచేసిరిగాని యొక చిల్లిగవ్వయైనను తీసికొనలేదు; పైఁగా
వీరేశలింగముగారికే ధనసాహాయ్యము చేసిరి.

మహాపండితులై శబ్దరత్నాకరము రచించిన శ్రీబహు
జనపల్లి సీతారామాచార్యులుగారు పంతులుగారి సమకాలి
కులు పంతులుగారి నీతిచంద్రికను శ్లాఘించి చెన్నపురి బహి
రంగసభలో వారిని గౌరవించిరి.

వీరేశలింగము పంతులుగారి సత్కార్యాచరణ దీక్ష
యెందరినో వదాన్యులనుగఁ జేసినది. పైడా రామకృష్ణయ్య
గారు వితంతు వివాహనిధికి ముప్పదివేల రూపాయల విరాళ
మొసగిరి. శ్రీ పిఠాపురము రాజాగారు ఉన్నత పాఠశాలకు
డెబ్బది వేలిచ్చుటయేగాక యనాథశరణాలయము మొదలగు
ధర్మసంస్థలెన్నో స్థాపించిరి. పోలవరం జమీందారుగారును,

పండితపోషకులును, శ్రీ వీరేశలింగము పంతులుగారి శిష్యులు నగు కె. ఆర్. వి. కృష్ణరావుగారు ధర్మసంస్థలకు వేలకొలంది రూప్యములను నిచ్చిరి.

ఆంధ్రదేశమున బ్రహ్మమత సిద్ధాంతప్రచారమునకు పట్టుకొమ్మయై బ్రహ్మర్షియను సార్థకనామమొందిన శ్రీరఘుపతి వెంకటరత్నము నాయుడుగారును వీరేశలింగము పంతులుగారి సమకాలికులలో ముఖ్యులు వీరేశలింగోన్నత పాఠశాలా స్థాపనమందుం తోడ్పడుటయేగాక హితకారిణీసమాజ ధర్మకర్తృసంఘములో నాయుడుగారు సభ్యులై యుండిరి.

ఆంధ్రదేశమునందలి ప్రముఖులేగాక మనదేశమందలి యితరరాష్ట్రీయులలోను మహామహులు పంతులుగారి సమకాలికులై యుండిరి. మూడవ వితంతువివాహమును బంతులుగారు జయప్రదముగ జరపిన పిదపం గలకత్తానుండి యీశ్వరచంద్రవిద్యాసాగరుల వారిట్లు పంతులుగారికివ్రాసిరి. దేశముయొక్క యీభాగములలో మూడవ బ్రాహ్మణ వితంతువుయొక్క వివాహమును గూర్చిన సమాచారము నకై నేను మీ కెంతయు నుపకారస్మృతి కలవాండనై యున్నాను. ఇక్కడి వితంతు వివాహవిహితులీ శుభవర్తమానమునలన మిక్కిలి సంతోషము నొందియున్నారు. అదృష్టహీనులైన దుఃఖభాగినులపక్షమున మీయొక్క పరోపకార ప్రయత్నములకు నిరంతరము జయము కలుగునుగాక! మీసుహృదుడైన ఈశ్వరచంద్రశర్మయొక్క నమూహిత ప్రార్థన.

ఆంగ్లేయులలోఁగూడఁ బంతులుగారికి సుప్రసిద్ధులగు సమకాలికులుండిరి. రాజమహేంద్రవరపు గవర్నమెంటు కాలేజి ప్రిన్సిపాలుగనుండి పేరుప్రతిష్ఠలు పొందిన మెట్కాఫు గారును విద్యాశాఖకు డైరక్టరుగనుండి యతిసమర్థులని పేరు పొందిన ఫఁకనుగారును బంతులుగారి యందెంతయో ఆదర విశేషముగల్గి యుండిరి. ఇందు మొదటివారు పంతులుగారి కున్నతపాఠశాల స్థాపన మొదలగు విషయములందు మిగుల సాయపడిరి. రెండవవారు పంతులుగారి పాండిత్యమును గుర్తించి వారిని ప్రెసిడెన్సి కళాశాల పండితునిగఁజేసి యనేక రీతుల గౌరవించిరి.

చెన్నరాష్ట్రపు గవర్నరగు లాలీగారు 1909 వ సంవత్సరమున రాజమహేంద్రవరము వచ్చినపుడు పంతులుగారికి ప్రత్యేకదర్శన మొసఁగి గౌరవించిరి.

## 14. అంత్యదినములు

దమజీవితమునఁ దమకు ప్రీతికరములగు ననేకసంస్థల సంస్థాపించిన పిదపఁ బంతులుగారు 1907 వ సంవత్సరము నుండి కలకత్తా, బెంగుళూరు, బొంబాయి, పూనా నగరములకు బ్రహ్మసమాజ కార్యములమీఁదను, సంస్థలకు జందాలు చేర్పించుటకును సంచారములుచేసిరి. ఇట్లు రెండవసారి బెంగు

[illegible] 1910 వ సంవత్సరములో తిరిగి వచ్చిన పిదప స[illegible]గారికి ఘోరవిపత్తు సంభవించెను. పంతులుగారి సతీమణియగు రాజ్యలక్ష్మమ్మ గారాయన జీవితమున నెఱవేర్పఁ దలఁచుకొనిన సత్కార్యము లన్నిటియందును చేదోడు వాదోడుగనుండి సహధర్మచారిణియను పదమును సార్థకము చేయుచుండిరి. సహజముగ నీశ్వరభక్తితో నిండియుండి యామె యనేకప్రార్థనాగీతముల రచించెను. భార్యకుండ వలసిన లక్షణముల మనపెద్దలు వక్కాణించియున్నారు.

శ్లో. కార్యేషుమంత్రీకరణేషుదాసీరూపేచలక్ష్మీఃక్షమయాధరిత్రీ
స్నేహేచమాతాశయనేచరంభాషట్కర్మయుక్తాఖలుధర్మపత్నీ

ఈలక్షణములన్నియు శ్రీరాజ్యలక్ష్మమ్మ గారియందు బూర్తిగాఁ బట్టియుండెను. ఆమె నిరంతరసహకారమే పంతులుగారి సంఘసేవకు చాలవఱకు సహాయభూతమై సంఘ సౌభాగ్యమును బెంపొందింపఁ జేసినది. ఇట్టి సుగుణాలవాలయగు రాజ్యలక్ష్మమ్మగారు 1910 వ సంవత్సరము ఆగస్టు 11 వ తేదీని పగలంతయు నారోగ్యవతిగనేయుండి సుఖనిద్ర ననుభవించి తెల్లవారు సరికి హృద్రోగముచే ననాయాస మరణము పొంది, యీశ్వరసాన్నిధ్యము చేరెను.

హఠాత్తుగ దటస్థించిన యిట్టి ఘోరాపద దటస్థింపగా బ్రకృతిదోషమువలనఁ బంతులుగారు మొదట మిగుల

ఖిన్నులై పిదప చింతమాని సర్వరక్షకుఁడగు నీశ్వరుఁడే శరణ్య మని నమ్మి రాజ్యలక్ష్మమ్మగారిని దమతోఁటయగు నానందా శ్రమముననే దహనసంస్కారము చేయించి పిదప రాజ్య లక్ష్మి నివాసమను గృహము నాతోఁటలో నేకట్టించి దానిలో పాలరాతితో చేయఁబడిన సమాధినిబెట్టి యందు రాజ్య లక్ష్మమ్మగారి యస్థికలుంచిరి.

వీరేశలింగము పంతులుగారికిని రాజ్యలక్ష్మమ్మగారికిని సంతానము కలుగలేదు. ప్రథమవితంతువివాహము చేసికొనిన గోగులపాటి శ్రీరాములుగారికి ప్రథమకళత్రమువలనఁ గలిగిన నాలుగుమాసముల పురుషశిశువును నాపుణ్యదంపతులుపెంచి పెద్దవానిని జేసిరి. ఆపిల్లవానికి వీరేశలింగమనియే పేరు పెట్ట బడెను. ఈవీరేశలింగమునకుఁ దన మేనగోడలి నిచ్చి వివా హముచేసి తనవద్ద నుంచుకొనవలెనని రాజ్యలక్ష్మమ్మగారి యుద్దేశము పంతులుగారిందుల కడ్డు చెప్పలేదుగాని తమ యాస్తినిమాత్రము ధర్మమునకే వినియోగించుట కాయన నిశ్చయించుకొనిరి. గోగులపాటి వీరేశలింగము పంతులుగారి యుద్దేశము ననుసరించి యిరువదియొకటవయేఁడు వచ్చినుండి వితంతువును వివాహము చేసికొనఁ దలచినట్లు చెప్పుచు, నం దులకు ప్రయత్నములన్నియుఁ బంతులుగారు చేయుచుండగా హఠాత్తుగా నభిప్రాయము మార్చుకొని మైసూరువెళ్ళిప్రాయ శ్చిత్తము చేయించుకొని యచట నొకపిల్లను పెండ్లాడి తర్వాత బంతులుగారివద్దకు రాక వేరుగా నుండెను.

సతీమణి స్వర్గస్థురాలై నప్పటినుండియుఁ బంతులుగారి కుపచారమునకు లోపము గల్గెను. రాజ్యలక్ష్మమ్మగారు సోమరితనమనునది యెఱుఁగక గృహకృత్య నిర్వహణాదుల యందు విరామము లేక పాటుపడుచు తీరికయైనపుడెల్ల నేదో వ్రాయుచుండుటలోను చదువుచుండుటలోను కాలము గడపుచుండెను. ఆసుశీల తాను చేయవలసిన కృత్యములలో నెల్ల భర్తగారి సంరక్షణము తనకు ప్రథమకర్తవ్యముగా భావించి యాయనను పసిబిడ్డను పెంచినట్లు పెంచుచుండెను. భార్య మరణించిన మరునాఁటినుండియుఁ బంతులుగారికి వంటచేసి పెట్టువారు లేకుండిరి. వితంతు శరణాలయమందలి వారే కొంత వఱకుఁ బంతులుగారి సంరక్షణమునకుఁ బూనుకొనిరి. కాని యదియంత తృప్తికరముగ లేకుండెను.

1911 వ సంవత్సరము కడపట నొక దినమున హఠాత్తుగఁ బంతులుగారికి మూర్ఛవచ్చి పావుగంటసేపు స్మృహ తప్పి పోయియుండిరి. ఈశ్వరేచ్ఛవలనఁ బంతులుగారు కోల్కొనిరిగాని చాల బలహీనులైరి. రెండు నెలలకుఁ గొలఁదిగ శక్తి చేకూర నారంభించి నప్పటికిని చేయివణఁకు మొదలగు బాధలచే నేమియు వ్రాయలేకుండిరి. ఇట్టి బలహీనస్థితియందుండి సర్వదాలోకరక్షకుని ప్రార్థనలు నెరపుచు నెట్టెటో కాలము వెళ్ళఁబుచ్చుచు వీరేశలింగము పంతులుగారు 1919 వ సంవత్సరము మే నెల 27 వ తేదీని రాజమహేంద్రవరమున నానందాశ్రమములో నీశ్వరసాన్నిధ్యమును జేరుకొనిరి.

# 15. గుణవిశేషములు

శ్రీ వీరేశలింగము పంతులుగారి జీవితచర్యనుగూర్చి చదివిన మీఁదట నామహానీయునియందుఁ గల గుణవిశేషము లనేకము మనము గ్రహింపవచ్చును. పంతులుగారు గొప్ప కార్యశూరులు, సాధారణముగా లోకమున నొక్కొక్క మహా పురుషుఁ డొక్కొక్క విషయమును జేఁబూని యందభివృద్ధికిఁ గారణభూతుఁడగు చుండుట మనము చూచుచుందుము. పంతులుగారి విషయమున నట్లుగాక వారనేకవిషయములం దొకే సారి తమ కార్యశూరతను చొప్పించి యన్నింటియందును మిక్కుటమగు నభివృద్ధి గనుఁబఱచి మార్గదర్శకులగుట మనము గుర్తింపవలసిన విషయమై యున్నది.

వీరేశలింగము పంతులుగారు బాల్యమునుండియు దుర్బలశరీరులు; సన్నముగా పూఁచికపుడకవలె పెద్దగాలి వేసిన నెగిరిపోవునట్లుండిరి. తండ్రిగారు చిన్నతనముననే గతించుటచే వీరేశలింగముగారి పితామహియు, ప్రపితామహియు నాయన నల్లారుముద్దుగఁ బెంచి తినుటకుఁ గోరినదెల్ల నిచ్చుచుండుటచే బాల్యమునుండియు నజీర్ణరోగము బయలు దేఱెను. శరీరవిషయమున నిట్టి లోపములున్నను నీశ్వరకటాక్షమువలన వారి బుద్ధివిశేష మసాధారణమైనది. ఆయన ఏక సంతగ్రాహిగ నుండెను. ఆ మనఃధీపటిమను స్వార్థమునకుఁగాక

లోకోపకారమునకు వినియోగపడుటచే నది యాంధ్రదేశీయుల యదృష్టఫలితమే యని చెప్పవలసి యున్నది.

తల్లి గుణములు కొన్ని పంతులుగారికిఁ బట్టుపడినవి. ప్రకృతిచేతఁ బంతులుగారు కోపస్వభావముగలవారు. ఆయనకుఁ గోప మతిశీఘ్రముగవచ్చి యొక్కొక్కపుడు తొందరగాఁ బరుషభాషణము లాడుచుండిరి. కాని వెంటనే పశ్చాత్తాపపడి దయారస మొలికించుట యాయనకు నైజగుణము.

చిన్నతరగతులలోఁ జదువునప్పటినుండియు పంతులుగారు తెలివికిఁ దోడు పాపభీతియు, సద్వర్తనమును, దైవచింతయు గలవారై యాడినమాట తప్పనివారని పేరుబొంది విద్యార్థులచేతనేగాక యుపాధ్యాయులవలనఁ గూడ గౌరవము బొందుచుండిరి. ఒకసారి రాజమహేంద్రవరమున జిల్లాజడ్జిగారు పాఠశాలకువచ్చి పాఠశాలలోని బాలురలోనెల్ల సద్వర్తనముగలవాఁ డెవడో యాపిల్లవాని పేరు వ్రాయుడని బాలురందఱకును కాగితపుముక్కల నియ్యగా నధికసంఖ్యాకులగు బాలురు వీరేశలింగముగారి పేరు వ్రాసిరి.

ఎచటనైన నక్రమము కనఁబడినచో దాని సహించియూరకుండుట పంతులుగారి స్వభావముకాదు. వెంటనే ప్రతిక్రియచేసి యాయక్రమము తొలఁగించువఱకు నాయన కూరటలేకుండెను. అంతేగాక పంతులుగారి కేదైన నభిప్రాయముకలుగుటకును దాని నమలుజరుప యత్నించుటకును మధ్య విశేషము కాలవిలంబనముండదు. ఆయన యందుండిన యీ

గుణములే సంఘశ్రేయమునకు మిగులఁ దోడ్పడి యాయనచే ననేకములగు సత్కార్యము లొనరింపఁజేసెను.

దేహమునకుఁ దటస్థించిన బాధలనేగాక మనస్సునకుఁ గల్గు క్లేశములనుగూడఁ జాల యోరిమితో సహించు తితీక్షయుఁ గష్టసహిష్ణుతయుఁ బంతులుగారి కెక్కువగ నుండెను. ప్రతిపక్షులనుండియేగాక మిత్రులనుండియు, నొక్కొక్కప్పుడు తమవలన ననేకములగు లాభములు పొందినవారి నుండియుఁ గూడ వీరేశలింగము పంతులుగారికి చిక్కులు సంభవించుచుండెను. అట్టి సమయములం దాయన యెంతయో శాంత చిత్తతతో బ్రవర్తించి క్లిష్టపరిస్థితుల దాఁటగల్గుచుండెను. సంఘసంస్కరణమన్న కర్ణకఠోరముగనుండి సంస్కారవాదుల నధికసంఖ్యాకులును, ప్రబలులునగు పూర్వాచారపరాయణులు పెట్టిన బాధలను ధీరులగు వీరేశలింగము పంతులుగారెట్టి మన స్థైర్యముతో నెదుర్కొనిరో చూపుటకు లెక్కలేనన్ని నిదర్శనములు గలవు.

ఒక సత్కార్యము చేయఁబూనినపు డొకటి రెండు స్వల్పాంతరాయములు గల్గినంతమాత్రమున నాకార్యములను విడుచుటకుఁ బంతులుగా రెపుడును దలఁచుకొనువారుకారు. తగిన యదనునకై వేచియుండి తాము తలపెట్టిన కార్యమును వారు కొనసాగించుచుండిరి. పురమందిర నిర్మాణమును, ఆస్తికపాఠశాలా స్థాపనము నిందుకుఁ బ్రబలతార్కాణములు.

స్వధర్మనిర్వహణమునఁ బంతులుగారు నిష్పక్షపాతముగ సంచరించిరి. రాజమహేంద్రవరము-డలపాఠశాలయం దుపాధ్యాయులుగనుండి నపుడు సోదరోపాధ్యాయుని తమ్ముఁడొకఁడు విద్యార్థిగనుండి యవిధేయతచూపఁగా మిగిలిన యుపాధ్యాయు లతనిని శిక్షించుటకు వెనుదీయుచుండిరి. కాని పంతులుగారాబాలుని వెంటనే బల్లపై నెక్కించి నిలువఁబెట్టిరి. ఈవిషయ మాబాలుని సోదరులగు తమసోదరోపాధ్యాయులకుఁ దెలిసినపు డాయన కోపగింపలేదు. సరిగదా పంతులుగారి నెంతయో మెచ్చుకొనిరి. ఆబాలుఁడును పెద్దయై ఎఫ్. ఏ. క్లాసు చదువుచుండినపుడు గూడ పంతులుగారికిఁ గృతజ్ఞతదెల్పుచు లేఖవ్రాసెను. పత్రికా నిర్వహణమందును బంతులుగారు నిష్పక్షపాతముగ శత్రువులు, మిత్రులు ననుభేదములేక లోపము గనుఁబడినయెడల నెల్ల విమర్శించుచుండిరి.

మునిసిపలుకౌన్సిలు, తాలూకాబోర్డు, జిల్లాబోర్డులలో సభ్యులుగనుండిన దినములలో పంతులుగారు స్వార్థమిసుమంతయులేక ప్రజాహితసంస్థలలోఁ బ్రజాప్రతినిధులెట్లు మెలఁగవలెనో నిరూపించిరి. ఆకాలమున మునిసిపలు సభ్యులు తమయిండ్లముందరనే లాంతరు స్తంభము లేర్పఱచుకొనుచుండిరి. వీధులలో నాక్రమణలెక్కువగ నుండెను. కొంతప్రబలులైనవారు మఱియును ధైర్యముగ నిట్టి యాక్రమములఁజేయు

చుండిరి. పంతులుగారు సభ్యులుగ నున్నపుడు మొగమోట మేమియులేక యెట్టివారినైన నాక్రమణలనుండి తొలఁగించ యత్నించిరి. సమయము వచ్చినపు డాంగ్లేయోద్యోగులతోఁ గూడ ధైర్యముగ వాదించి న్యాయపక్షమును నెగ్గించుటకుఁ దోడ్పడిరి. మంచిదనియు, ధర్మమనియు దోఁచిన యంశ మును నిర్భయముగా మొగముముందఱ చెప్పివేయు తొందర స్వభావము పంతులుగారి కెక్కువగ నుండెను.

వీరేశలింగము పంతులుగారు గొప్పస్వార్థత్యాగి. తా ననేకవిధముల శ్రమపడి సంపాదించినదంతయు సంఘసేవకు వినియోగించెను. తనకు పుత్రులు లేనపుడును తగినంత సొత్తు న్నపుడును ఒకరిపుత్రుని దత్తునిగ గైకొనుట మనలో నాచా రము 'అపుత్రస్యగతిర్నాస్తి' యను వచనము ననుసరించి పుత్రుఁడనగా పున్నామనరకమునుండి రక్షించువాఁడని నమ్మి తమకు త్తరలోకమున సౌఖ్యముగల్గుటకై దత్తునేర్పఱచుకొని సొత్తును సంక్రమింపఁజేయుదురు. పంతులుగారి కట్టి స్వార్థ బుద్ధిలేనందుచే దమకు ముందు కలుగఁబోవు సౌఖ్యముకంటె సంఘశ్రేయమే ముఖ్యతరమైనదని తలఁచి తమ సొత్తువంతను ధర్మసంస్థలకు వినియోగించిరి.

వీరేశలింగము పంతులుగారి వినమ్రస్వభావము శ్లాఘ నీయమైనది. స్వీయచరిత్ర వ్రాసికొనుటలో నాత్మశ్లాఘనము గల్గునేమోయను భీతిచే నాగ్రంథారంభమున నాయన యిట్లో

శ్లాఘాప్రార్థనము చేసియున్నారు. ఓభక్తవరదా! ఆత్మశ్లాఘా పాత్ర్యమును నామనస్సునుండి దూరముచేయుము. నాహృదయమందు సదావినయమును సత్యమును నెలకొల్పుము. భవత్ప్రీత్యర్థమయి పరమార్థచింతతోఁ దప్పఁ బ్రసిద్ధికయి నేనేపనిని జేయకుండునట్లు నాచిత్తమును శాసింపుము. దేవా విద్యాబుద్ధులయం దత్యంతదుర్బలుఁడనైన నాజీవనచరితము బహుజనాదరపాత్రమయి విశేషోపయుక్తమగునది కాకపోయినను, ఘనుల మహాకార్యప్రకటనమువలెనే సామాన్యుల యల్పకార్యప్రకాశనముగూడ నభివృద్ధికి సహకారియగు నన్న యార్యోక్తినిజమయ్యేనేని యీయవిశ్రుతచరితము సహితము కొందఱికి గొంత ప్రయోజనకారియగుఁ గాక!

పంతులుగారు తమ జీవితమునంతను సునీతి ప్రచారమునకును, దుర్నీతిభంజనమునకును ధారవోసియుండిరని యాయన చేసిన ప్రతి స్వల్పకార్యమువలనను, ప్రతిఘనకార్యమువలనను స్పష్టమగుచున్నది. వేశ్యానంపర్కమును దూఱినను, లంచగొండితనము ఖండించినను, వితంతువివాహముఁ జేసినను, మఱియేపనిచేసినను నీతివ్యాపనము కొఱకే. ఇంకొక విశేషమేమన ఆయనకుఁగల కవితాశక్తి యంతయు దుర్నీతి నిర్మూలనమునకును, నీతిమార్గప్రవర్తమునకును ధారాళముగ నుపయోగించిరి. ఈసాధనమువలన సంఘమున దుష్టవర్తనము సులభముగఁ దొలఁగించుట కనకాశ మేర్పడెను. అంతేకాక తాము చెప్పినదంతయుఁ దామాచరించి యెట్టి కష్టములనైన

నెదుర్కొనుటకు నంసిద్ధతచూపుట వీరేశలింగము పంతులు గారి యుద్దేశములన్నియు నించుమించుగ సఫలమగుటకుఁ బ్రధానకారణము.

వీరేశలింగము పంతులుగారు మహాభక్తుఁడు. ఆయ నకు దైవచింత యుగ్రుపాలతోఁ బోయఁబడినది. ఏకార్యము తలపెట్టిన నాయన యీశ్వరధ్యానము చేసి భారమీశ్వరుని పైనేవేసి తనకర్తవ్యమును ధర్మపథము దప్పక యాచరించు చుండెను. ఆయనపూనిన యన్ని యుద్యమములును తోడి మానవుల సౌభాగ్యమే ప్రధానాశయము గాఁగలవి. మానవ సేవయే మాధవసేవ—అను సిద్ధాంతము నాయన తూచా తప్పక యనుసరించెను. వీరేశలింగము పంతులుగారు జీవిత చరిత్ర మొక్క యాంధ్రదేశమునకేగాదు, భారతదేశమునకే గాదు, లోకమున కంతకును నాదర్శప్రాయమైనది. పంతులు గారు సంస్కర్త, కవి, త్యాగి, కర్మయోగి. ఇట్టిపుత్రునిగన్న యాంధ్రమాత నిజముగ ధన్యురాలు.

శ్రీ వీరేశలింగము పంతులుగారి దివ్యజీవిత మాచంద్ర తారకముగ భావిసంతతి వారికిసన్మార్గప్రేరణము గల్గించి లోక కళ్యాణమునకుఁ దోడ్పడుఁగాక!

# తప్పొప్పుల పట్టిక

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 4 | (పోకడ | పోకడ |
| 4 | 2 | స్వార్ధ | సార్థ |
| 19 | 6 | పేరున | పేర |
| 22 | 5 | మరి | మఱి |
| 26 | 16 | పిలచి | పిలిచి |
| 27 | 1 | విలచుట | బిలుచుట |
| 39 | 3 | వినియోగించు | వినియోగించి |
| 40 | 19 | చేయుదింకా | చేయుదింక |
| ,, | 20 | నే నక్నలు | నన్నేలు |
| 46 | 17 | ఇచ్చి | యిచ్చి |
| 56 | 3 | ఉపాధ్యాయులును | ఉపాధ్యాయిను |
| 60 | 22 | మమ్ము | నమ్ము |
| 62 | 13 | సఘుము | సఫలము |